# పూర్వ మీమాంసా దర్శనము

(జైమిని మహర్షి)

(మొదటి భాగము)



సాహిత్య ఎకాడమీ పురస్కార గ్రహీత
కళాప్రపూర్ణ
చర్ల గణపతిశాస్త్రి

# ఒక వినుతి

ఈ తెనుగు నేలపై నన్నయనుండి నేటివరకు ఎందరో సంస్కృతాంధ్ర కవిపండితులు పట్టి భాషను పరిపుష్టము చేసి వెలలేని తులలేని కావ్య ప్రపంచమును సృష్టి చేసినారు. ఆదికాలపు కవి పండితుల మాట నటుంచి నేటికాలము అనగా ఈ 20వ శతాబ్దములో కూడ పండితులు, కవులు ఎందరో జన్మించారు. వారిలో గండపెండరాలు, కవిసార్వభౌమ, కవిసామ్రాట్టు, జ్ఞానపీఠ అవార్డు గ్రహీతలున్నారు. శతాధిక గ్రంథములను రచించినవారున్నారు. సాహిత్య ప్రక్రియలో గల ఉద్గ్రంథములనుండి, నవలలు, నాటకాలు, పాటలు, ఇంకా, ఇంకా గలవాని నన్నింటిని చేపట్టి కలాన్ని ఖడ్గమువలె ఝుళిపించి భేష్ అని అనిపించుకున్నవారును ఉన్నారు. అట్టివారిలో ఈనాటి (అనగా 20వ శతాబ్దములో) కవి పండితులలో విలక్షణమైన భూమికను అన్ని రంగాలలో పోషించిన ప్రముఖులు బ్రహ్మర్షితుల్యులు శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు.

శ్రీ గణపతిశాస్త్రిగారి పాండితీ వైభవాన్ని గురించి చెప్పగల స్తోమత నాకు లేదు. అయితే చిరకాలము వారితో చాల సన్నిహితముగ నుండుట వలనను, వారు చెప్పగ వినుటవలనను సాహసించి ఈ రెండు మాటలు వ్రాయుచున్నాను.

వీరిది పండిత వంశము, పండితులకు జన్మస్థానముగ పేరొందిన కాకరపఱ్ఱు వీరి జన్మస్థలము. జనకులు శ్రీ నారాయణశాస్త్రిగారు పేరుగల పండితులు. తండ్రిగారివద్దనే విద్యాభ్యాసం చేశారు. వ్యాసునకు శుక బ్రహ్మవలె, నారాయణశాస్త్రిగారికి గణపతిశాస్త్రిగారు.

శ్రీ గణపతిశాస్త్రిగారు తెనుగు భాషలోనే గ్రంథరచన చేసినప్పటికి వారికి అభిమానపాత్రులైనవారు సంస్కృత కవులే. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు ఈ ముప్వురియందు వారికి మక్కువ ఎక్కువ. శ్రీ శాస్త్రిగారు

అభిమానించిన తెలుగు కవులెవరో నాకు తెలియదు. అనగా వారికి సంస్కృతభాషపై యెనలేని గౌరవాభిమానములని చెప్పుటేగాని మరొకటి కాదు. సంస్కృతభాషా ప్రచారమునకు వారు ఎంత కృషి సల్పినది విశాఖ పట్టణవాసులకు తెలియును. అందుకొఱకు సులభ సంస్కృత చంద్రిక అను పుస్తకము నాల్గుభాషలలో మొదట ముద్రింపించినారు. తదుపరి తెలుగులో ముద్రించినారు. "నేను సంస్కృతము నేర్చుకుంటాను" అని తమ దగ్గరకు వచ్చినవారికి సంస్కృతము నేర్పుటయే తమ ధ్యేయముగా పెట్టుకున్నారు వారు.

శ్రీ గణపతి శాస్త్రిగారు చేసినది అనువాదమే అయినను అది కూడ ఒక విలక్షణముగ చేసిన పని. వారు సామాన్యముగ ఆంధ్రకవి పండితుల వలె గాక ఎక్కువగ శాస్త్ర గ్రంథముల అనువాదమునకు పూనుకొన్నారు. దర్శనములు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు, పూర్వమీమాంస, ఉపనిషత్తులు, వేదమంత్రార్థ వివరణ, తెనుగు వ్యాకరణము, సాహిత్య సౌందర్య దర్శనము, రాగమూర్ఛనలు, గాంధర్వవేదము, వేదవిజ్ఞానము, యోగ సర్వస్వము యిత్యాదిగ. ఇది వీరిలో గల విలక్షణత. ఇటువంటి గ్రంథాలను ఇప్పుడి మధ్య ఎవ్వరును స్పృశించలేదు. ఇవి ఒక వర్గము వారికి మాత్రమే. ఈ విషయము శాస్త్రిగారే పదేపదే అన్నారు, అనుకొన్నారు. అంతమాత్రముచేత వదలివేయరాదని భావించి, అనువదించి, ముద్రణ శాలను స్థాపించి, ధన సంపాదనయందు ఆసక్తిచూపక, ఉన్న సుక్షేత్రములను తెగనమ్మి అచ్చువేసి ఆంధ్ర ప్రజానీకానికి అందించారు. ఇటువంటి పని ఎంతమంది చేయగలరు? చేశారు?

కేవలము ధన సంపాదనమే ధ్యేయముగ పెట్టుకుని సంస్కృతము నభ్యసించినవారికి బోధపడని ఈ శాస్త్ర గ్రంథములు సామాన్యులకు అర్థమగుటెట్లు? ఈ విషయమును దృష్టిలో నుంచుకొనియే శాస్త్రిగారు తక్కువ శ్రమతో తేలికగా అర్థము చేసుకొనుటకై అనువాదములు చేసి అందించినారు ఆంధ్రులకు.

అంతేకాదు, శాస్త్రిగారు ఎంతటి పండితులో అంతటి వినయశీలురు. వారు పండితులను ఎంతగా ఆదరించి గౌరవించెడివారో, అంతగానే ఓ, న, మాలు నేర్వకుండా రచనలుచేసే సామాన్య రచయితలను కూడ గౌరవించేవారు, ఆదరించేవారు. ఇది వారి వ్యక్తిత్వము.

ఇక ఆధ్యాత్మికపరంగా ఎంతో ఎదిగిపోయిన వ్యక్తి శ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు. పెసరగింజను నానబెట్టి మొక్క మొలచిన తరువాత తినడం అంటే నిద్రపోతున్న ప్రాణిని లేపి హత్య చేసినట్లని వారి భావము. ఇది ఒక మచ్చుతునక.

ప్రకృతమునకు ఈ పూర్వ మీమాంసా దర్శనమును వ్రాసి అచ్చునకు ఉపక్రమించి, సాగుతుండగా, వారు తామే స్వయముగ ప్రూపులు దిద్దుకొందామని అనుకున్నారు. కాని గ్రంథము పూర్తి కాకుండానే వారి జీవితకాలము పూర్తిఅగుటచేతను, నాకు ఈ శాస్త్రగ్రంథముతో పరిచయము లేకపోవుటచేతను, వారి వ్రాతప్రతిలోని అక్షరములు సరిగా నుండనందునను, కొంతవరకు ప్రూపులు దిద్ది, తరువాత అశక్తతను మానినందువలన, ఈ గ్రంథము ప్రథమ భాగముగా నింతవరకు విడుదల చేయడమైనది. మెల్లిదిగా దీని తరువాయి భాగము కూడ వారి కుటుంబ సభ్యులు పూర్తి చేయాలన్న తలంపుతో నున్నారు. ఆ నారాయణుడు ఈ కార్యము నిర్విఘ్నముగ నెఱవేర్చు శక్తి సామర్థ్యములను వారి కుటుంబ సభ్యులకు ఇచ్చుగాక.

ఇట్లు
భక్తజన సేవకుడు
కోవల్లె రామమూర్తి

# తొలి పలుకు

ఆచార్య దివాకర్ల రామమూర్తి

బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ చర్ల గణపతిశాస్త్రిగారు కాకరపర్తి పండితులు పితృపాదులకడ సంస్కృతాంధ్ర సాహిత్యములు, ఉపనిషచ్ఛాస్త్ర పారావారమును తుదముట్ట నభ్యసించిన దిట్టలు. జన్మతః భారత సంస్కృత్యభిమానులు, నిష్కళంక దేశభక్తులు.

భారతదేశపు సంస్కృతికి ఉనికిపట్టు వేదవాఙ్మయము, వేదవాఙ్మయము బహుశాఖోపశాఖలతో విరాజిల్లినది. ప్రతి శాఖాధ్యయనమునకు కొంత పూర్వ సంస్కారము తర్క సాహాయ్యము ఎంతయో కావలయును.

శ్రీ శాస్త్రిగారు పుట్టి నేర్చుకొనెనో, పుట్టకయే తద్విజ్ఞానము సంక్రమించినదో పూర్వ సుకృత విశేషమున,

పండ్రెండు ప్రధానములయిన యుపనిషత్తులను, బ్రహ్మసూత్రములను, దర్శనములను, వేదవిజ్ఞానమును ననువదించి పఠితలకు సమర్పించినారు. వారి యనువాదమపురూపమయినది. తత్తద్విషయికములయిన భాష్యములను కూలంకషముగా విమర్శించి, పూర్వ రచయితల విధానాలను దిలకించు, సత్క్రమము, ధర్మవిరోధ రహితములయిన మూలాభిప్రాయాభిన్నములయినవియు నగు అర్థముల గ్రహించి, సరళశైలిలో తెనుగులో అనువాదము సాగినది. కొన్ని కొన్నింటికి అనువాదములను పద్యములలో ప్రధానముగాఁ దెనుగు అనుష్టుప్పులలో వారు చేసిరి. అనువాదము శాస్త్రిగారి దృష్టిలో వారి పాండిత్య ప్రకర్షణ, వైదుష్య విశారదత్వమునకు కాక, మూలగ్రంథ హృదయమును యథాప్రసిద్ధ భాషోపపన్న సిద్ధాంతానుసరముగా రచించుట.

వారి యనువాదములు శ్రద్ధతోఁ జదువఁదగినవి. జిజ్ఞాసతో తత్త్వ మెఱుంగఁదగినవి. అప్పుడే యవి సుబోధకములు, హృదయానంద దాయకములు.

శాస్త్రిగారి వైదిక గ్రంథానువాదము పండితామోదకరముగా జరిగినవి. శ్రీ గణపతి శాస్త్రిగారు, ఒక వంక రామాయణాదులను పద్యములలో ననువదించుచు, మహాపురుష జీవితములను ధర్మశాస్త్రములను, ఋగ్వేదానువాదమును జరిపి పత్రికా లోకమునకెంతయో సేవచేసిన ధన్యులు. వారు వేద వాఙ్మయము మొదలుకొని, స్తోత్రమంజరి వఱకు రచించిరి. భక్తి సూత్రముల, నారదశాండిల్యులవి గుదికూర్చి భాగవత పద్యోదాహరణములతో నొసంగిరి. ఇది యొక సామాన్య మనీషి సాధింపఁదగినది కాదు!

వారు దర్శన షట్కము ననువదించిరి. వానిలో ఈ పూర్వమీమాంసా దర్శనము ఒకటి.

వారి నిర్యాణానంతరము లిఖిత ప్రతిని కుమార్తెలు వారి లలితా ముద్రణాలయమున ముద్రింపించి తండ్రి యెడగల భక్తిని ప్రదర్శించుకొనిరి. శాస్త్రిగారిది నిర్దుష్టమయిన ఆదర్శము. భారతీయ వైదిక సంస్కృతి యందలి విశిష్టములను ప్రజలకందించుట. ఆ యాశయపరిపూర్తికి వారు దివానిశలు శ్రమించిరి. అట్టి శాస్త్ర విచారణ గ్రంథములలో ఈ పూర్వ మీమాంసా దర్శనమొకటి.

"మీమాంసా—మాన్, విచారే" పరిపూర్ణమయిన, లేదా, కూలంకషమైన విచారణ—సమాలోచనము.

ఆ యర్థముననే 'కావ్యమీమాంస" తైత్తిరీయమున ఆనందమీమాంస అను పదములు వాడఁబడినవి. హిందూవేదాంతము షడ్దర్శనములలో వ్యక్తీకరింపఁబడినది. ఈ ఆరు దర్శనములు మొదట రెండింటిగానె విభజింపఁబడి యుండినవి.

1) పూర్వమీమాంస, లేక కర్మమీమాంస. ఇది జైమినిచే ప్రణీతము.
2) ఉత్తరమీమాంస—లేక బ్రహ్మమీమాంస. ఇది బాదరాయణ (వ్యాస ప్రణీతము.

కాని రెండింటి విషయములలో సామ్యములు చాల తక్కువ ఈ రెండింటిని కళాప్రపూర్ణులు శాస్త్రి గారనువదించి జిజ్ఞాసువుల కెంతయో యుపకారమాచరించిరి.

పూర్వ మీమాంస వేదోక్తమయిన కర్మకాండ విషయమున సంబంధము కలిగినది. అంతియకాక, — వేదవాక్యముల యర్థావబోధ మందు యత్కించిత్సంశయమున్న మీమాంస నిర్ణయించి, సిద్ధాంతమొనర్చినది.

ఉత్తర మీమాంస బ్రహ్మవిషయమును విచారించును.

పూర్వ మీమాంస కర్మ సిద్ధాంతద్యోతకము.

ఈ పూర్వ మీమాంసా దర్శనమునందలి భాగములకు అధికరణము లందురు. అధికరణమున, విషయము, సంశయము, పూర్వపక్షము, సిద్ధాంతము, ప్రయోజనము – అనునవి పరిస్ఫుటముగా విమర్శింపఁబడును. సూక్ష్మముగ విచారము సాగుమనే సిద్ధాంతము స్థాపింపఁబడును. ధర్మలక్షణాధికరణము, ధర్మప్రామాణ్య పరోక్షాధికరణము, వేదము స్వతః ప్రమాణమును అధికరణము, శబ్దము నిత్యమను నధికరణము, వేదములు పౌరుషేయములను అధికరణము మున్నగునవి కలవు. ఒక యధికరణమును వాదోపవాదములను శ్రద్ధగా నవగాహన చేసికొనుచు చదువవలయును.

ఇందు సంస్కృత మూలములు యథాతథముగా వ్రాయఁబడి, వానిపై వచ్చు వాదోపవాదములను పూర్వపక్ష సిద్ధాంత ప్రయోజనములు వివరింపఁబడినవి.

ఇది శాస్త్ర విచారము కథ కాదు. ప్రాచీన వేదమూలముల యందు తద్వివరణములయందు విశ్వాసముంచి, జ్ఞానార్జనమునకు చదువఁదగినది.

అప్పుడే వివేకముదయించును, భారతీయ సంస్కృతియందాదరము కలుగును.

ఇది యొక యపూర్వ రచనము.

ఇట్టి వైదిక విజ్ఞాన జ్యోతిని వెలిగించుటకై సంతతము యత్నించి కృతకృత్యులై జీవితమును భారత సంస్కృతికి అర్పించిన శ్రీ శాస్త్రిగారికి ఒడలెల్ల చేతులుగా నమస్కరించినను ఋణము తీరదు.

పఠితలకు కర్తవ్యమొకటి యున్నది. గ్రంథమును జదివి విజ్ఞానవంతులై ఆనందించి భారతీయ సంస్కృతికి నీరాజనమొసంగుట. అప్పుడే శాస్త్రిగారికి హృదయతృప్తి.

మద్గురుమూర్తయే నమః.

# దేవ గురు నమస్కృతి

అగజానన పద్మసవితృ
ని, గజానను, భక్తులకు ననేక దళను గా
పృగఁ గూర్చెడి యేక దళను
పగలును రాత్రియు మిగుల నపాసింతు యెదన్

తొల నారాయణుఁ డాత్మరూపమున నెందున్ క్షీర మట్లొప్పి లీ
లలకై యావయి పాలమీగడయటుల్ వ్యక్తాకృతిం బొంది ని
ర్మల మాకాశము నందు గాలి, జ్వలనం బాపై నటస్ నీరునం
దిల,యన్నంబయి జీవియై వెలుగు నా యీశున్ సదా మ్రొక్కెదన్

శ్రీనారాయణ శాస్త్రి వి
జ్ఞాన ధురీణుని ననేక శాస్త్రజ్ఞుఁ గవీ
శానుని జనకుఁని దలఁచి
యేననఁగా ఋషుల కృత మహాబ్ధి మథింతున్

ఆ దిన్ సృష్టికి ముందు కేవల మొకే యాత్మంబ యై యుండి యా
మీఁదన్ సత్త్వరజస్తమోగుణములన్ బెంపొంది భిన్నుండవై
కాదే సృష్టియుఁ దస్థితి ప్రళయముల్ గావించి మోదింతు వా
వేధో విష్ణుహర త్రిమూర్తికిని నివ్వే నీకు మా దండముల్

మూర్తి యదొక్కటె విధి చేసె మూడు పనులు
ముందు వెనుక మూఁడింటికి మామూలు మాట
హరి హరున కాది, హరుఁడొకప్డతని కాది
వారికిని బ్రహ్మ, బ్రహ్మకు వారునాది

— ౦ —

# పూర్వ మీమాంసా దర్శనము-

## మొదటి అధ్యాయము-మొదటి పాదము

### 1 ధర్మ జిజ్ఞాసాధి కరణము.

1 సూ. అథాతో ధర్మ జిజ్ఞాసా.

అథ- మఱి వేధాధ్యయనము గురుకులమునఁ జేసినపిదప

అతః- విచారణ పూర్వక వేదాధ్యయనము ప్రాప్తించినందువలన

ధర్మజిజ్ఞాసా- ధర్మము యొక్క జిజ్ఞాస (తెలిసికొనఁగోరిక) చేయుచున్నది.

సూ. మఱి యింక గురుకులమున వేదమును జదివిన పిదప వేదమును విచారణా అర్థ పూర్వకముగఁ దెలిసికొను ప్రవృత్తి గలిగినందువలన ధర్మజిజ్ఞాస చేయబడు చున్నది.

వివ:- విషయము, సంశయము పూర్వపక్షముసిద్ధాంతము ప్రయోజనముఅనునవి గలదానిని అధికరణమందురు. ఏదేని ఒకటిచెప్పఁ దలఁచినప్పుడు అందుఁ జెప్పఁదగినవిషయము దానిని గుఱ్ఱిన సంశయము. అందు ప్రతిపక్షులు చేయు పూర్వ పక్షము. దానిని ఖండించి చెప్పు సిద్ధాంతము, దానివలనఁ గలుగు ప్రయోజనము ఇవి యన్నియు అధికరణములో నుండును. స్వాధ్యాయో ఽధ్యేతవ్యః వేదము చదవఁ దగినది. అన్నది విషయము. ఈ యధ్యయనము స్వర్గము కొఱకా? అర్థజ్ఞానము కొఱకా అని సంశయము, స్వర్గము కొఱకె అధ్యయము చేయ వలయును. భారతాధ్యయ నాదులందు అర్థము ఇమిడ్చి యుండుట వలన అధ్యయనము అర్థ జ్ఞానము కొఱకుకాదు. అని పూర్వ పక్షము. భారతాధ్యయ నాదులందువలె వేదార్థము క్లుప్తముకాదు కాన అర్థజ్ఞానము కొఱకని సిద్ధాంతము. దీని వలన స్వర్గము ప్రయోజనము. ఇట్లు అన్ని యధికరణములందును గ్రహింప వలయును.

గురుకులమున వేదము చదివి బ్రహ్మచారియగు వటువు ఇంటికి రాక పూర్వమె ధర్మమును గూర్చి తెలిసికొనఁ గోరవలయును,

## 2. ధర్మ లక్షణాధి కరణము.

2 మూ. చోదనా లక్షణో ఽర్థో ధర్మః

చోదనా_వేదమందలి విధిబోధకవాక్యము. నిషేధబోధకవాక్యమును లక్షణః_ లక్షణముగాఁగల అర్థము -పురుషార్థము ధర్మము అనబడును.

సూ. వేదమందలి ప్రవర్తక విధి బోధక వాక్యములచేఁను నివర్తక విధి బోధక వాక్యములచేతను బోధింపఁబడిన యర్థము ధర్మము.

వివ:- వేదము విధి, మంత్రములు, అర్థవాదములు నామధేయ ములుఅని నాలుగు విధములుగా నుండును.

బ్రాహ్మణ భాగము విధి బోధకము మంత్రము స్తుతి ప్రశంసా పర ములు. అవి యాగాది ప్రయోగకాలమందు అర్థస్మరణకు హేతువులై యుపయోగించును. అర్థవాదములు బ్రాహ్మణ శేషములు అర్థవాదములు యజ్ఞదేవతా హోమాది నామములు నామధేయములు. "యజేత స్వర్గ కామః" స్వర్గము కోరువాడు యజింప వలెను. అన్నది యజ్ఞమందు ప్రవ ర్తింపజేయు ప్రవర్తకవిధి వాక్యము. నహింస్యాత్ సర్వా భూతాని" ఏ భూతములను హింసింపరాదు. ఇత్యాది హింసాదులను నిషేధించి నివ ర్తింపఁజేయు నివర్తక విధులు విధివాక్యములు భూత భవిష్యద్వర్తమాన సూక్ష్మ వ్యవహిత విప్రకృష్టాది విషయములను దెలుపుటకు సమర్థమైనవి. ఇతరములు అట్లు దెలుపుటకు సమర్థమైనవిగావు. శ్రేయస్కరములైన జ్యోతిష్టోమాదికములు అర్థములు. ప్రత్యవాయ జనకములు అనర్థకములు. వేదములు ప్రత్యక్షముచేఁగాని అనుమానముచేగాని తెలియబడని స్వర్గాది విషయములను బోధించునవిగాన అవి ఇతర విషయములనుదెలుపు గ్రంధ ములకంటె విలక్షణములు, అను సంగతి "ప్రత్యక్షేణానుమానేన యస్తూ పాయోనలభ్యతే ఏనం విదంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా" అను సూక్తి తెలుపు చున్నది.

## 3. ధర్మ ప్రామాణ్య పరీక్షాధి కరణము-

ధర్మ జ్ఞానమునకుఁ బ్రత్యక్షము ప్రమాణము గాదని తెలిపెడి యధికరణము.

3 సూ. తస్య నిమిత్త పరీష్టిః

తస్య- ఆ ధర్మముయొక్క నిమిత్త- కారణములయొక్క ప్రమాణముల యొక్క పరీష్టిః- పరీక్ష చేయఁబడుచున్నది.

సూ. అధర్మమును తెలిసికొనుటకు నిమిత్తము పరీక్షింపబడుచున్నది.

వివ:- అ ధర్మమును తెలిసికొనుటకు సాధనములు వేద విధి వాక్యములా? మఱి యితరములా? అని పరీక్షింపబడు చున్నదని భావము

4 సూ. సత్సంగప్రయోగే పురుషస్యేంద్రియాణాం బుద్ధిజన్మతత్ ప్రత్యక్షం అనిమిత్తం విద్యమానోపలంభాత్

పురుషస్య- పురుషునియొక్క ఇంద్రియాణాం- నేత్రాదులైన యింద్రియములకు, సత్- ఉన్న వస్తువులతో విషయములతో, సంప్రయోగే- సంబంధమున్నది. బుద్ధిజన్మ- బుద్ధియందు పుట్టునది తత్- అది ప్రత్యక్షము- ప్రత్యక్షమన బడును. విద్యమాన- ఎదురుగఉన్న వస్తువులను మాత్రమె ఉపలంభాత్ గ్రహించుటవలన అది అనిమిత్తం- ధర్మస్వరూప నిర్ణయమునకు, నిమిత్తముగాదు.

సూ. పురుషుని యింద్రియములకు తమయెదుటి విషయములతో సన్నికర్షమున్నపుడు పుట్టునట్టి ప్రత్యక్షము ఎదుటి వస్తువులను మాత్రమె గ్రహించునదిగాన అది అప్రత్యక్షమైన ధర్మమును నిర్ణయించుటకు నిమిత్తము గాదు.

వివ:- ఇంద్రియములు ధర్మ నిర్ణయముతో సాధనములుగా నిరసించుటచేత ప్రత్యక్షజ్ఞానమును ఆధారముగాఁ జేసికొని యేర్పడు నను

మానోప మానార్థాపత్తులను ప్రమాణములు ధర్మమును నిర్ణయించునవి గావు. ఇందు భావరూపమైన ప్రత్యక్షాదులు ధర్మ నిర్ణాయకములు గావని నిరాకరింపఁ బడెను.

## 5. ధర్మ విషయములో వేదము స్వతః ప్రమాణము తెలుపు నధికరణము.

5 సూ. ఔత్పత్తికస్తు శబ్ద స్యార్థేన సంబంధాత్తస్య జ్ఞానముపదేశో అవ్యతిరేకశ్చార్థేఽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయ స్యానపేక్షత్వాత్.

శబ్దస్య=శబ్దమునకు, అర్థేన=అర్థముతోఁ గలసంబంధః సంబంధము, ఔత్పత్తికః= సహజము నిత్యమైనది. తస్య ఆశబ్దార్థమునకు, జ్ఞానం=జ్ఞానము గలిగించునది. ఉపదేశము, ఆప్తోపదేశమైన వేదము, అది, అనుపలబ్ధే ప్రత్యక్షాదులచే గ్రహింప బడని, అర్థే=అర్థమందు అవ్యతిరేకః=వ్యభిచరించునదిగాదు, కనుక అది వేదవిధివాక్యము. అనపేక్షత్వాత-ఇతర పురుషుని యొక్కగాని ఇతర ప్రత్యక్షాది ప్రత్యయములయొక్క అపేక్ష లేక పోవుటవల్ల బాదరాయస్య-వ్యాసునికి ప్రమాణం-ప్రమాణమె.

సూ. శబ్దమునకు అర్థముతో గల సంబంధము నిత్యముగాన అనిత్యమైన శబ్దార్థముల జ్ఞానము గలిగించు వేదము ప్రతక్షాదులచే గ్రహింప బడని యర్థమువి పర్యయసంశయాదులగు గలిగింపక నిశ్చయ జ్ఞానమును గలిగించునదిగాన ఇతర జ్ఞానములను అపేక్షింపక స్వతంత్రముగాఁ దెలుపునది అది వ్యాసునికి ప్రమాణమె యగును.

వివ:_ శబ్దము అర్థజ్ఞానమును గలిగించునది ప్రతిపాదకము. అరము శబ్దమువల్ల గలిగిన జ్ఞానము ప్రతిపాద్యము, ఈ రెండింటి సంబంధము నిత్యము. "అగ్నిహోత్రం జుహుయాత్" అగ్నిహోత్రమున హోమము చేయవలయును అనువాక్యము కాలత్రయమందును దాని యర్థమును అతిక్రమించి ప్రవర్తింపదు కాన ఇది ఇతరాపేక్ష లేకుండుచే స్వయముగఁ బ్రమాణమనిభావము ఇందు అభావబోధకమైన యనుపలబ్ధికి గమ్యమగునది ఖండింపఁబడినది.

## 6. శబ్దము నిత్యము అను తెలుపు నధికరణము

6 సూ. కర్మైకే తత్ర దర్శనాత్,
తత్ర=కంఠతాల్వాది ప్రయత్నముల తరువాత, దర్శనాత్=కనిపించుట వల్ల ఏకే=కొందఱు, కర్మ= (శబ్దము) కార్యమని (అనిత్యమని) అందురు.

సూ. కంఠము తాలువులు మొదలయిన యవయవముల ప్రయత్నము తరువాత వినబడుట వలన శబ్దము అనిత్యమని అక్షపాదాదులు చెప్పుదురు.

వివ:- ఇంక పూర్వపక్ష సూత్రములు చెప్పబడుచున్నవి. శబ్దార్థముల సంబంధము నిత్యమనియు అనిత్యమైన వేదవిధి వాక్యము ప్రమాణమని ఇదివరలో జెప్పబడినదానిని ఖండించు సూత్రమిది. ప్రయత్నోత్తర కాలమందుఁ గనిపించుటవలన శబ్దము అనిత్యము. ఇట్టి యనిత్యమైన శబ్దముల స్వరూపమైన వేదవిధి వాక్యములబట్టి ప్రామాణ్యమును జెప్పుట సరికాదని పూర్వపక్షయొక్క యాక్షేపము. గౌతమాది నైయాయికుల మతమిది.

7 సూ. అస్థానాత్.
అస్థానాత్=ఉచ్చరించిన పిదప స్థిరముగా నుండదుగాన అనిత్యము.

వివ:- ఉచ్చరించుటకుఁ బూర్వము శబ్దము కనిపించదు. ఉచ్చారణ సమయమున మాత్రమె కనిపించి తరువాతఁ గనిపించదు నశించిపోవుచున్నది కాన దానికి స్థిరత్వము లేదు అది అనిత్యమని భావము.

8 సూ. కరోతి శబ్దాత్.
కరోతి=శబ్దము చేయుచున్నాడు అను శబ్దాత్=శబ్ద వ్యవహారము వల్ల

సూ. చప్పుడు చేయుచున్నాడు అను వ్యవహారమును బట్టి శబ్దము అనిత్యము.

వివ:- చప్పుడు చేయుము చప్పుడు చేయకు, చప్పుడు చేయుచున్నాడు మొదలగు వ్యవహారములబట్టి ఇదివరకు లేనిచప్పుడు ఇప్పుడు చేయుచున్నాడని తెలియుచున్నది గాన శబ్దము అనిత్యమని భావము.

9 సూ. సత్త్వాంతరేచ యౌగపద్యాత్

సత్త్వాంతరేచ=ఇతర ప్రాణులయందును ఆశబ్దము యౌగపద్యాత్ ఒకే సమయమున ఒకేసరిగా నుచ్చరింపబడి కనిపించుటవలన శబ్దము అనిత్యము.

వివ:- అనేక పురుషాదుల చేత అనేక దేశకాలాదులందు ఒకేసారిగా నుచ్చరింపబడునది కార్యము అనేకము అది ఏకము నిత్యము కాజాలదని భావము. ఘటము పటము మొదలయిన శబ్దములను ఇక్కడవారు పలుకుదురు. అక్కడివారు వానినే పలుకుదురు. కాన అనిత్యమని భావము.

10 సూ. ప్రకృతి వికృత్యోశ్చ.

ప్రకృతి వికృత్యోః చ=ప్రకృతి వికృతులను బట్టియు

సూ. వ్యాకరణ శాస్త్రములందు సూర్యోదయము ఇత్యాది. స్థలము లందు అకార ఉకారములు ప్రకృతిగాను ఓ కారము వికృతిగాను జెప్పుట వల్లను శబ్దము నిత్యముగాదు.

వివ:- సూర్యోదయాది శబ్దముల సంధ్యాదులందు అకార ఉకార స్థానములందు ఓకారము వచ్చును. హర్యాదులు అనుచోట ప్రకృతి యను ఇకారమునకు యకారము వికృతి వచ్చును. అవి ఇత్యాదికముగా జెప్పుటచేత ప్రకృతిగా నున్నది వికారము పొందుచున్నపుడు అది యెట్లు నిత్యమగును. అది నిత్యమైనచో ఒకే రకముగా నుండవలయును గదా అని యాక్షేపము.

సూ. వృద్ధిశ్చ కర్తృ భూమ్నాస్య.

కర్తృ=ఉచ్చరించు కర్తయొక్క, భూమ్నా=ఆధిక్యముచే, అస్య=ఈశబ్దము యొక్క, వృద్ధిః చ= వృద్ధికూడ

సూ. ఉచ్చరించు వారెక్కువగా నున్నను ఈ శబ్దము పెద్దది వినబడుచున్నది గావునను ఇది యనిత్యము

వివ:- చాలమంది ఉచ్చరించినప్పుడు ఆ శబ్దము పెద్దదిగా వ్యక్తమగుచున్నది. అది అభివ్యక్తమైనప్పుడు చాల మందిచే తక్కువమందిచే

గూడ నుచ్చరించ బడినది ఆ శబ్దము అంతమాత్రముగానె గ్రహించ బడ వలసి యున్నది. అది పెద్దదిగా వినబడు చున్నది. అది నిత్యమైనచో ఒకే విధముగానే వినబడవలయును గాన అది అనిత్యమని పూర్వపక్షము.

12 సూ. సమంతు తత్ర దర్శనం

తత్ర= ప్రయత్న కాలమందు, దర్శనంతు= కనిపించుటయైతే, సమం= సమమె

సూ. శబ్దము ప్రయత్నకాలమందుఁ గనిపించుటయను సంగతి శబ్దనిత్యతా నిత్యత్వ పక్షములు రెండింటియందు సమముగానే యుండును.

వివ;- ఇది సిద్ధాంత సూత్రము. శబ్దము కరతాల్వాది స్థానముల వచ్చిన కార్యమని చెప్పినప్పుడు అనిత్యమని యన్నను అట్లుగాదు. కంఠ తాల్వాది స్థానములవల్ల బుట్టదుకాని యభివ్యక్తమగునని చెప్పినప్పుడు నిత్యమని అన్నను రెండు పక్షములందు ప్రయత్నోత్తర కాలములందు శ్రుతి గోచరమగుట సమానమని భావము.

13 సూ. సతః పరమదర్శనం విషయానాగమాత్.

విషయ=వ్యస్తుతి విషమగు శబ్దమునకు, అనాగమాత్=సంబంధము లేక పోవుటవలన, సతః ఉన్నదానికి, అదర్శనం=కనిపించకపోవుట పరం= యుక్తము.

సూ. విషయమైన శబ్దమునకు దానిని వ్యక్తము చేయు సంయోగ విభాగములతో ముందుగాని తర్వాతగాని సంబంధము లేకపోవుట వలన (ఉన్నదే స్థిరముగా నున్నదీ) కనిపించుట లేదనుట యుక్తము.

వివ:. శబ్దమును అభివ్యక్తపఱచునవి సంయోగ విభాగములె, కాని సంయోగ విభాగములు శబ్దమును జేయవు పోగొట్టవు. వాయు తరంగములను బట్టి ఆ శబ్దము చెవి రంధ్రమును బ్రవేశించి వ్యక్తము చేయును. అభిఘాతముచే ప్రేరింపబడి వాయువులు ఇతర వాయువులను బాధించుచు అన్ని దిక్కులందున్న సంయోగ విభాగములను పుట్టించును.

వానివేగమున్నంత వఱకె అవి అట్లే నిలచి యుండును. అవి వాయు తరంగములు ముగియనప్పడె శబ్దము మనకు తోచును. కావున అస్థిరముగా నున్న శబ్దమును అభివ్యక్తపఱచునేగాని పుట్టింపవు. కాన (అవికార్యము) లు అందుచే అనిత్యములని చెప్పరాదని భావము. కనుక స్థిరముగా నుండవు గాన అవి అస్థిరత్వమును బట్టిచెప్పు భాగము కుదరదు. ఇట్లు 7వ సూత్రమునకు ఇది ఖండనము. అడ్డు గలిగించు వాయ్వాదులు లేనిచో అనుకూల వాయువును బట్టి ఆకాశమున శబ్దము ఉపలబ్ధమగును. సంయోగ విభాగములు పైకిఁ గనిపింపవు గాని చెవియందు శబ్దము ప్రాదుర్భవించునని తెలియునది.

14 సూ. ప్రయోగస్య పరం

ప్రయోగస్య=ప్రయోగముయొక్క అర్థమునకు పరం=తాత్పర్య గ్రాహకము

సూ. శబ్దము చేయుచున్నాడు అను వ్యవహారమును బట్టి శబ్దము అనిత్యము అని చెప్పిన వాక్యములో శబ్దముచేయు చున్నాడు అనుచోట శబ్దము యుచ్చారణ పరమైనది,

వివ:- పేడ చేయుచున్నాడు అనుచోట పేడ ముద్దలు చేయు చున్నాడు అన్నియర్థము చెప్పకొనునట్లు శబ్దము చేయుచున్నాడు అక్షరాదులతో శబ్దముల యుచ్చారణము చేయు చున్నాడు. అను వ్యవహారమును బట్టి శబ్దము అనిత్యమనరాదని భావము ఇది 8 సూత్రమునకు ఖండనము.

15 సూ. ఆదిత్యవ ద్యౌగ పద్యం.

యౌగపద్యం= ఒక మాటుగా అనేక స్థలములందు పొందబడుట. ఆదిత్యవత్= సూర్యునివలె.

సూ. ఎట్లు సూర్యుడు ఒకడే యయ్యును అనేకులకు అనేకస్థలము లందుఁ గనిపించుచున్నాడో అట్లే శబ్దము నిత్యమే యైనను అనేకులకు అనేక స్థలములందు గొప్పదిగా గ్రహింపబడుచున్నది.

వివ:- ఆకాశ గతమైన శబ్దమొకటేకాని సూర్యునివలె అనేకదేశస్థులచే అనేకులచేత గ్రహింపబడుచున్నది. ఆకాశమొక్కటే అందు వ్యాప

కముగానున్న శబ్దమును ఒకటి. దేశములో దానిని గ్రహించు జనులు భిన్నులైనంత మాత్రమున అది అనేకము అనిత్యము కాదని వాయువునకు సంబంధించిన సంయోగ విభాగములు అడివబడుకున్న ఆ శబ్దమునె చెవి దగ్గర వ్యక్తమును చేయును. కాని క్రొత్తగా కనిపింపవు అని భావము ఇది 9వ సూత్రమునకు ఖండనము.

16 సూ. శబ్దాంతర మ వికారః

శబ్దాంతరమః= సంధ్యాదులలోని ప్రకృతి వికృతులు ఇతర శబ్దములు. అవికారః= వికారములు కానివి

సూ. సూర్యోదయాది శబ్దములందున్న ఓ కారాదులు ఇతరవర్ణములె గాని వికాతములుగావు గాన శబ్దము నిత్యమె.

వివ:- సూర్యోదయము ఇత్యాది శబ్దములతో ఓ కారము మఱి యొక వర్ణమె కాని ఉకారమునకు వికారముగాదు. అకార ఉకారములు ప్రయోగింప వలసినవుడు ఓకారమును ప్రియోగింప వలయునని భావము సంధ్యాదులను జెప్పు వ్యాకరణాదులు బాలురకు సులభముగా తెలుపుటకు ప్రవర్తిల్లినవి. చాపలల్లువాడు తృణమును గ్రహించునట్లు ఓ కారమును ప్రియోగించువాడు అకార ఉకారములను స్వీకరింపడు. తృణముల వికారముచాపయైనట్లు పాల వికారము పెరుగైనట్లు అకార ఉకారముల వికారము ఓ కారము కాదు. అకార ఉకారములను దగ్గర ఉచ్చరింప వలసినవుడు ఓ కారముఅను మఱియొక వర్గమును ఉచ్ఛరింప వలయునని వ్యాకరణాదులు బోధించునని గ్రిహింపవలయును. కాన ఇది 10వ సూత్రిమునకు ఖండనము.

17 సూ. నాద వృద్ధివరా

నాదవృద్ధి= ధ్వనియె, పరా=అర్ధపరమైనది.

సూ:- శబ్దము పెద్దదిగా నున్నదనుచోట శబ్దవృద్ధి పదము నాద వృద్ధి స పరమైనది.

వివ:- భేరులు ప్రయోగించునప్పుడు అనేకులు ఒకేసారి పలుకునపుడు శబ్దము పెద్దగాఁ దోచుచున్నది. అది భేరీ మనుష్యాదులు గట్టిగా పలుకుట

వల్ల గలుగు చున్నదే శబ్దము పెద్దది చిన్నది యగుట చేతగాదు. అది ఎక్కువగా తక్కువగా చేయుచున్నది వీనిని బట్టి అది పెద్దదివలె అవయవములు గలదివలె తోచునుగాని శబ్దమును బట్టిగాదు. శబ్దమెపుడును ఒకే రీతిగా నుండును. కాన దానిని బట్టి శబ్దము అనిత్యమనరాదని భావము. ఇది 11వ సూత్రమునకు ఖండనము.

18 సూ. నిత్యస్తు స్యాద్దర్శనస్య పరార్థత్వాత్.
దర్శనస్య=ఉచ్చారణము, పరార్థత్వాత్=ఇతరుల కొఱకగుట వలన శబ్దము నిత్యః తుస్యాత్=నిత్యమైనదే యగును.

సూ. శబ్దోచ్చారణము ఇతరులకు బోధించుటకే యగుటవలన శబ్దము నిత్యమె.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము. శబ్దము ఉచ్చరించిన వెంటనే నశించినచో అది మునుపటి దుండదు గాన వినువారికి అర్థమును గలుగఁ జేయదు. అపుడది వ్యర్థమగును. శబ్దోచ్చారణము ఇతరులకొక విషయమును తెలుపుటకే గదా. అది మన అనుభవములో ఈ శబ్దము వలన ఈ యర్థము నాకు తెలియు చున్నది శబము అనిత్యమైనచో అది మనకు అర్థమును గలుగఁ జెయదని భావము.

19 సూ. సర్వత్రయౌగ పద్యాత్
సర్వత్ర= అన్నిచోట్ల యౌగ పద్యాత్= ఒకే రీతిగా అర్థమగు చుండుటవల్ల శబ్దము నిత్యము.

వివ:- ఎంతమంది ఎన్నిచోట్ల గోవు మొదలగు శబ్దములను ఉచ్చరించినను అర్థమగు చున్నది. అది భ్రమ మూలకముగాదు. అక్కడ గోవు అన్నది సర్వ గోవులను జెప్పుచున్నది అది జాతి పరమైనది. అది యనిత్యమైనచో అన్నిచోట్ల అందఱకు ఎట్లు అర్థమగును. గవాది శబ్దములు అనిత్య మైనపుడు అవి ఎప్పటికి నశించును గదా. అవి ఇతరులకెట్లు అర్థమగుటకు నిలచి యుండును. అవి నిత్యములు అన్నిచోట్ల అంత మందికి అర్థమును గలిగించుచున్నవని భావము.

20 సూ. సంఖ్యా అభావాత్.

సంఖ్యా= పది గో శబ్దములని సంఖ్య, అభావాత్=లేకపోవుటవల్ల

సూ. ఒకే గో శబ్దమును చాలసార్లు ఉచ్చరించుచున్నానని గాని చాల గో శబ్దములను ఉచ్చరించుచున్నానని గవాది శబ్దముల సంఖ్య లేక పోవుట వలన శబ్దము నిత్యమె.

వివ:- వ్యవహారములో ఏ శబ్దమును ఉచ్చరించితినో దానినే చాలసార్లు ఉచ్చరించుచున్నాను అనియే గలదుగాని చాల గవాది శబ్దములను ఉచ్చరించు చున్నానని సంఖ్య లేకపోవుటవలన శబ్దము నిత్యము ఏ శబ్దమును పలికితినో దానినే పలుకు చున్నాననుటలో ఇది పలిలోనున్న దానినే పలుకు చున్నాననియేగాని క్రొత్త శబ్దమును పుట్టించి పలుకుచున్నానని సంఖ్యలేకపోవుట వలనను శబ్దము నిత్యమె గాని అనిత్యము గాదని భావము.

21 సూ. అనపేక్ష త్వాత్.

అనపేక్షత్వాత్= అపేక్షింపం బడక పోవుటవలన

సూ. ఘట పటాదులు వాని యవయవములు నశించినచో అవి నశించునని వాని కారణములయిన యవయవాదులు నశించుట అపేక్షింపం బడినట్లు శబ్దములు వాని యవయవాదుల నాశమును బట్టి నశించునని నాశ కారణములు తెలియం బడకపోవుటవల్ల అవి నిత్యము.

వివ:- అనిత్యములగు ఘటపటాదులు వాని యవయవములగు కపాలములు తంతువులు నశించిన నశించుచున్నవి శబ్దముల కట్టి యవయవములు కనిపింపవు గాన అవినశింపవు నిత్యములని తెలియవలయు నని భావము.

22 సూ. ప్రఖ్యాభావాచ్చ యోగ్యస్య.

ప్రఖ్యా= ఉపలబ్ధి, యోగ్యస్య= కనిపించుటకు యోగ్యమైన శబ్దము లు అభావాతచ్చ= లేక పోవుటవలనను

సూ. కనిపింప యోగ్యమైన శబ్దము వాయువు అవయవములందు ఉపలబ్ధముకాక పోవుటవలనను శబ్దము అనిత్యముగాదు.

వివ:- వాయురాపద్యతే శబ్దతాం వాయువు శబ్దత్వమును పొందు చున్నది. అని శిక్షాకారులు చెప్పుచున్నారు. దీనినిబట్టి శబ్దము వాయువ వల్లఁ బుట్టిన దనరాదు. శబ్దమేగనుక వాయు సంబంధించున దైనచో వాయుపుయొక్క సన్నివేశ విశేషమైన కావలసి యుండును. వాయువు నకు సంబంధించిన యవ యములను శబ్దము నందున్నట్లు వస్త్రమునందు తంతులను గుర్తించినట్లు మనముగుర్తించుట లేదు. వాయువు స్పృశింపఁ బడినట్లు శబ్దము స్పృశింపఁ బడినట్లు శబ్దము స్పృశింపఁ బడుటయులేదు. కాన శబ్దము వాయువువల్లఁ గలిగినదని చెప్పి అనిత్య మనరాదనిభావము.

23 సూ. లింగ దర్శనాచ్చ.

లింగ= కారణము, ధర్శనాత్చ= కనిపించుట వలనను.

సూ. వేదమందు శబ్దము నిత్యమనిచెప్పు సూచన కనిపించుట వలనను శబ్దము నిత్యము.

వివ:- "తస్మైనూన మభిద్యవే వాచా విరూపనిత్యయా వృష్ణే చోదస్వసుష్టుతిం" (తై-2-6-11-2) అను మంత్రములో వాచా విరూప నిత్యయా' అని చెప్పఁ బడినది. విరూప= రూపము కర్తృత్వములేని నిత్యయా= నిత్యమైన వాచా= వాక్కుతో అగ్నిని స్తుతింపుము అనిశబ్దము నిత్యమని చెప్పబడినది. ఈ వేదమంత్రము ప్రామాణ్యమువల్లఁ గూడ శబ్దము నిత్యమని భావము.

ఇది శబ్దము నిత్యమని చెప్పు నధికరణము

## 7. వేదము అర్థమును బోధించునది అనిచెప్పు నధికరణము

24 సూ. ఉత్పత్తౌవా అవచాః స్యురర్థ స్యాతన్నిమిత్తత్వాత్ అర్థస్య=పదముల యర్థము, అతన్నిమిత్తత్వాత్= వాక్య తాత్పర్యార్థ నిమిత్తమైనది కాక పోవుటవలన, ఉత్పత్తౌ= వాక్యార్థ తాత్పర్యమైన ధర్మ ము యొక్క యుత్పత్తిలో అవచనా, = అప్రమాణములె.

సూ. పదములయర్థము పురుష ప్రయత్నము లేకుండ వాక్యార్థ తాత్పర్యార్థమయిన ధర్మోత్పత్తిలో నిమిత్తము గాదు. కాన శబ్దముస్వాభావికమై నిత్యమైనను వేదవిధి వాక్యార్థ రూపమైన చోదనలు ప్రమాణములే గావు.

వివ:- ఇది పూర్వ పక్షసూత్రము. శబ్దము దాని యర్థ సంబంధము నిత్యమైనను చోదనా లక్షణమైనదిగాదు ధర్మము. అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః స్వర్గము కోరువాఁడు అగ్నిహోత్రమును హోమము చేయవలయును! అను దానిలోని ఏదో యొక పదమువల్ల స్వర్గము కలుగు నను సంగతి తోచుచున్నది. ఆ మూడు పదములు ఉచ్చరింపఁబడగా అది తోచుచున్నది. ఇంకొక నాలుగవ పదము లేదు. ఇందు పదములు ప్రయోగింప బడినవి. ని యర్థము నిత్యమె. వాక్యర్థ సముదాయము ప్రయోగింపఁ బడలేదు. కనుక సముదాయార్థము కృత్రిమమైనఁ గావలయును వ్యామోహమైన గావలయును. పదార్థములె వాక్యార్థము గాదు. సామాన్యముగా పదము ఉండును. వాక్యార్థము విశేషముగా ఉండును. సామాన్యము వేరు విశేషము వేరు. దానికి సంబంధము లేక పోవుటవలన పదార్థము వల్ల వాక్యార్థము అవగతము గాదు. సంబంధనము లేనపుడు అవగతమైన యే యర్థమందు అర్థాంతము తోఁచును ఏది తెలియగా అంతయు తెలియ బడిన దగును. ఇది యట్లు తెలియ బడదు, కాన వాక్యార్థము అన్యమె యగును. కాన అర్థహీనమైన వాక్యార్థరూప వేదవాక్యము ప్రమాణము గాదు. గోవు, గుఱ్ఱము అన్నవి సామాన్య వాచకములు, తెల్లగోవు నల్ల గుఱ్ఱము ఇవి విశేష వాచకములు. గోవు, అశ్వము అనగా వ్యక్తియే గాని జాతి తోచదు. ఈ వాక్యార్థ తాత్పర్యమగును. ఇది పదార్థ జన్యము గాదు, అందుచేత పదార్థము వేఱు వాక్యార్థము వేఱు, అది పురుష కల్పితము కాన కృత్రిమము. కాన వైదికములు కూడ పురుష కృతములే గాన అవి ప్రమాణములు గావని పూర్వ పక్షము.

2౦ సూ. తద్భూతానాం క్రియార్థేన సమామ్నాయో అర్థస్యతన్నిమిత్తత్వాత్.

అర్థస = వాక్యార్థ ప్రతీతి, తన్నిమిత్తత్వాత్ = పదార్థప్రతీతియె నిమిత్తము గల దగుటవలన, తద్భూతానాం = ఆ పదార్థము లందున్న యర్థములకు, క్రియార్థేన = క్రియావాచక పదముతో, సమామ్నాయః = చక్కగా పరస్పరాన్విత స్వార్థ బోధక రూపముగా ఉచ్చారణము సిద్ధమగుచున్నది.

సూ. పదార్థముల ప్రతీతిని బట్టియె వాక్యార్థమగు తాత్పర్యము గలుగను గాన ఆ పదార్థము లందున్న యర్థము క్రియా వాచక పదముతో పరస్పరాన్వయ బోధ కలుగును గాన నావేదవిధి వాక్యములు ప్రమాణమె.

వివ:- ఇదిసిద్ధాంత సూత్రము పదములచేఁ జెప్పబడిన పదార్థములే వాక్యార్థమును బోధించును. దానిని బోధించుటకు పదార్థములకంటె వేఱె యింకొక వ్యాపారము అక్కరలేదు. ఆ పదార్థములు వాక్యార్థమును బోధింప వన్నచో అపుడు ఆ పదార్థములను జెప్పుటయె వ్యర్థమగునుగదా వాక్యార్థ బోధక పదార్థ మూలకము. కాన వేద విధి వాక్యములు పురుష కల్పితములు గావు స్వభావ సిద్ధములె గాన అందుచేత స్వర్గకాముడు యజింప వలెను. ఇత్యాదులు ప్రమాణములే యని భావము.

26 మూ. లోకే సన్నియమాత్ ప్రయోగ సన్నికర్షస్స్యాత్.

లోకే = లోక వ్యవహారములో సన్నియమాత్ ఉన్న దానికే (ప్రసిద్ధ పద సన్నిధి అప్రసిద్ధార్థమును యపూర్వమైనను బోధించునన్న దానికే) నియమ ముండుటవలన, ప్రయోగ సంనికర్షః = వేదవాక్య ప్ర గముల సంబంధము, స్యాత్ = అగును.

సూ. లోక వ్యవహారములో పదార్థములను బట్టి వాక్యార్థ సంబంధము ఇట్లు గయిను చుండునను నిబంధనయుండును గాన వేదవాక్యము లందు వాని ప్రయోగముల సంబంధము గలుగును.

వివ:- ఇదియు సిద్ధాంత సూత్రమె. లోకములో పెద్దల వ్యవహారమును బట్టి పదములను బట్టి పదార్థములు వానినిబట్టి వాక్యార్థములు తెలిసి కొనునట్లే అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః స్వర్గము కోరువాడు అగ్ని హోత్రమును హోమము చేయవలయును ఇత్యాది వేద

వాక్యములందుఁ గూడ పదములను బట్టి పదార్థములు వానిని బట్టి అగ్ని హోత్రము హోమము చేయుట వలన స్వర్గము కలుగుననుః వాక్యార్థము కలుగును గాన అవి ప్రమాణములేయని సిద్ధాంతము. ప్రాచీన కాలము నుండి వేద రక్షకయి స్వర సహితముగా వేదములు గురు ముఖమునుండి శిష్యులు గ్రహించువారు. అట్లు మొదట గ్రహించిన పిదప వేదార్థ విచారము జరుపుటకే మీమాంస చెప్పఁబడుచున్నది. పాఠకాదుల అలసత్వము వలన కాలక్రమమున వేద పాఠము అర్థ రహితముగాఁజేయఁబడి చివరకు అర్థ విచారణ లేకయే కేవల పాఠము చేత ఫలము సిద్ధించును. అర్థము తెలిసికొన నక్కరలేదు నను స్థితికి వచ్చినది. అందుచే వేదము అర్థమును బోధించునది! అనునది కరణము చెప్పవలసిన యవసరమేర్పడినది. నిరుక్తములో "స్థాణురయం భారహారః కిలాభూదధీత్యవేదం నవిజానాతి యో అర్థం యో అర్థజ్ఞ ఇత్ (= ఏన) సకలం భద్రమశ్నుతే" వేదమును జదివి యెవడు అర్థమును తెలిసి కొనడో వ్వాడు కేవలము బరువు మోసెడి యెద్దు. అర్థమును తెలిసినవాడె సమస్త శుభములను పొందును. నాకమేతి జ్ఞాన విధూత పాప్మా అర్థము తెలిసినవాఁడె అర్థజ్ఞానముచే పాపమును క్షాళన చేసికొని స్వర్గమును పొందును. యద్గృహీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే గురు ముఖము నుండి వినబడియే వేదము గురు ముఖము నుండి అర్థపూర్వకముగాఁ దెలియఁ బడదో అది పాఠమాత్రము చేతనే ఉచ్చరింప బడుచున్నది. అర్థపూర్వకముగాఁ దెలియ బడుటలేదు "అనగ్నా వివశుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్" (నిరుక్తం, అధ్యా 6 పా, 18) కట్టె ఎండినదైనను నిప్పులేనిచోట వేయబడినప్పుడు అది ఏ మాత్రం మండదు. " పాఠ మాత్ర రతాన్ విప్రాన్ వాఙ్మాత్రేవన నార్చయేత్ అని అర్థము తెలిసికొనకుండఁ గేవల పాఠము చేయు విప్రులను మాటచేగూడ గౌర వింపరాదు అను వాక్యములు అర్థమునకున్న ప్రాధాన్యమును తెలుపునవిగా గ్రహింప వలయును.

యోహవా అవిదితార్షేయచ్ఛందో దైవత బ్రాహ్మణే మంత్రేణ యాజయతి వాధ్యా యతివా స్థాణుం వార్ఛతి గర్తం వా పద్యతే పాపీయాన్ భవతి"

ఏవడైతే ఋషి దృష్టములైన మంత్రములు ఛందసు దేవతలు బ్రాహ్మణములు తెలియని మంత్రములతో యజ్ఞము చేయించునో చదివించునో వాడు స్థాణువు. గోతినిపొందును. పాపియగును. తాండవ తలవకారాది శాఖలు. ఏవం విదమేవ అధ్వర్యుం కుర్వీత నానేకం విదం ఏవం విదమేవ హోతారం కుర్వీతనానేవం విదం

ఏవం విదమేవ హోతారం కుర్వీత నానేవం విదం
ఏవం విదమే వోద్గాతారం కుర్వీత నానేవం విదం
ఏవం విదమేవ బ్రాహ్మణం కుర్వీతనానేవం విదం.

ఇట్లు వేదార్థము తెలిసిన అధ్వర్యునినె హోతను ఉద్గాతనే ఇట్లు తెలిసిన బ్రాహ్మణునే పెట్టుకొన వలయును. ఇట్లు తెలియని హోతను, ఉద్గాతను బ్రాహ్మణుని పెట్టుకొనరాడు" అని వాజసనేయశాఖలు. వీనినిబట్టి స్వాధ్యాయో అధ్యేతవ్య అనగా అర్థ జ్ఞాన పూర్వకము వేదము గురువు దగ్గర నుండి చదవ వలయునని భావము.

## 8. వేదములు అపౌరుషేయములు అని దెలుపు నధికరణము.

27 సూ. వేదాంశ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః
పురుషాఖ్యాః= (వేదములలోని పురుషులపేర్లున్నవి. సన్నికర్షం= వారి సంబంధమును బట్టి ఏకే= కొందఱు దార్శనికులు. వేదానిచ= వేదములను కూడ (పురుషకల్పితములందురు.)

సూ. వేదములలో కాఠకము. కాలాపకం పైప్పలాదము మొదలగు పురుషులకు సంబంధించిన పేర్లున్నవి. కాన వారిని బట్టి వారి పిదప వ్రాయ బడినట్లు తోచుచు చున్నవి గాన వేదాలను పౌరుషేయములనుగా గొందఱు దార్శనికు లందురు.

వివ:_ కఠశాఖీయులచే జెప బడినది కాఠకము. కలాపులకు సంబంధించినది కాలాపకము. పిప్పలాదుని బట్టి పైప్పలాదము అని పురుషులపేర్లు వేదములలోఁ గనిపించు చున్నవి. మఱియు జనకునికి యజ్ఞవల్క్యడు ధర్మములను జెప్పినట్లు మైత్రేయి, ఆత్రేయి, గార్గి

మొదలగు వారిని గూర్చిన కథలు సంభాషణములు కనిపించుచున్నవి. వీనిని బట్టి ఆ మనుష్యుల తరువాతనివి చెప్పబడియుండును గాఁబట్టి యివి ఎవరు కొందఱు పురుషులచేఁ జెప్ప బడిన వేదములు అందున్న విధి వాక్యములు. ప్రమాణములు గావని పూర్వపక్షి యాక్షేపము.

28 సూ. అనిత్య దర్శనాచ్చ.

అనిత్య= వేదములు అనిత్యములుగా దర్శనాత్‌చ= కనిపించుట వలనను

సూ. వేదము పుట్టినట్లు గనిపించుటను బట్టి అవి అనిత్యములుగాఁ గని పించుట వలనను వేదములు పౌరుషేయములు గాన ప్రమాణములు గావు.

వివ:- తేభ్యస్తప్తేభ్యస్త్రయో వేదా అజాయంత(శ. కాం. 11.అ.ఖ. తపింప బడిన వాని నుండి మూఁడు వేదములు పుట్టెను, అవి పుట్టినట్లు గని పించుచున్నది. అదిగాక వేదార్థములు జనన మరణములుగల వారిని బట్టి చెప్ప బడినవి. బబరః ప్రావహణి రకామయత కురువిందః ఔద్దాల కిరకామయత " ప్రవహణుని యపత్యమైన బబరుడు కోరెను. ఉద్దాలకుని కొడుకైన కురువిందుడు పలికెను. మొదలగు వానిలోగల పురుషవాక్యము లను బట్టి అవి వారి తరువాత వ్రాయ బడినవి. అంతకుమునుపులేవుగాన అవి యనిత్యములుగ గనిపించు చున్నవిగావ వేదములు అప్రమాణము లని భావము.

29 సూ. ఉక్తం తు శబ్ద పూర్వత్వం.

శబ్ద పూర్వత్వం=శబ్దము అదివఱకే యున్నదను విషయము, తు=అయితే ఉక్తం= ఇది వఱకే చెప్ప బడినది.

సూ. ఇది వఱకున్న శబ్దమె అధ్యయము చేయువారు తమ తమ గురువుల దగ్గరఁ జదువుచుండుట చేతను శబ్దము నిత్యము శ్రుతి యందు చెప్ప బడుటను శబ్దము నిత్యము. (చూ. 23 సూత్రము)

30 సూ. ఆఖ్యా ప్రవచనాత్

ప్రవచనాత్=ప్రకర్షగాఁ జదువుటను బట్టి ఆఖ్యా=కాఠకాది నామములు గలగినవి.

సూ. ప్రకర్షగఁ జదువుటను ఆ పేరులు వచ్చినవి.

వివ:_ వైశంపాయనుడు సర్వశాఖలను జదివెను. కఠుడైతే ఒక శాఖనే చదివెను. బహుశాఖలను జదివినవారి దగ్గఱ ఒకశాఖను జదివిన వాడు ఇంకొక శాఖను జదువు చున్నాడను విషయమును దెలువుటకై ఆనామములు చెప్ప బడినవని భావము. ఇది సిద్ధాంత సూత్రము.

30 సూ. పరంతు శ్రుతి సామాన్యం.

పరంతు= కాని అపురుష నామములు, శ్రుతి సామాన్యం శ్రుతి సామాన్య ములు చెప్పనవి.

వివ:_ పూర్వము ఉదాహరించిన వానిలో ప్రవాహణుడను వాని యొక్క కొడుకు ప్రావాహణి అని యర్థము కాదు. అటువంటి పురుషులు ప్రసిద్ధులు గారు. ప్రకృష్టము వహించునది ప్రవాహణము వాయువు. దానికి సంబంధించిన కర్త ప్రావాహణి ఎవరు ప్రవహింపఁ జేయునోవారు ప్రావాహణి అని సామాన్యార్థకముగాని పురుష వాచకముగాదు. బబరుడు అన్నది గూడ శబ్దాను కరణము కనక ఈ పేరులు నిత్యమైన పేర్లనే చెప్పు చున్నవి. కాని అనిత్యులైన పురుషులను గాదు. ఇట్లే కానికాది విషయము లను గురించియని తెలిసి కొనవలయును. మఱియు శ్రుతి చెప్పుచున్న పుడు ఏదోప్రసిద్ధ పురుషులనుగాక మనః కల్పిత నామములను సామాన్య ములు తెలుపుటకుఁ జెప్పెననియు గ్రహింవ దగును, కాన వేదములు అపౌరు షేయములు నిత్యములని సిద్ధాంతములని సిద్ధాంతము,

31 సూ. కృతే వా వినియోగః స్యాత్ కర్మణః సంబంధాత్

కృతేవా= కర్మయందుగాని, వినియోగః స్యాత్= ప్రయోగింపఁబడిన దగును. కర్మణః=కర్మయొక్క సంబధాత్=ప్రశంసాది సంబంధమునుబటి

సూ. కర్మ ప్రశంస యొక్క సంబంధమును బట్టి కర్మ యందు వాని వాని వినియోగము చేయబడి యుండును.

వివ :- వనస్పతయః సత్రి మాసత, సర్పాః సత్రమాసత వనస్పతులు (చెట్లు) యజ్ఞము లోనికివచ్చినవి సర్పములు యజ్ఞము నుపాసించినవి. అను వేదములలో జడములైన చెట్లు పాములు ఉపాసించిన వనుటపిచ్చివాని వాక్యములవలె నున్నవి. చెట్లు పాములు యజ్ఞము చూచుటకు ఎట్లు వచ్చును అనునవి ఎట్లు సంబంధించును. అని యాక్షేపణరాగా ఇట్లు సమాధానము చెప్పబడు చున్నది. యజ్ఞములకు విద్వాంసులేగాదు చెట్లు పాములు గూడ జడములైనవి యుపాసించిన వని చెప్పుటచే చెట్లు పాములె ఉపాసించి ఫలము పొందుచుండగా ఇంక విద్వాంసులు ఉపాసించి ఎట్లు ఫలము పొందరు. అని ప్రశంసా పరముగాఁ జెప్పబడినది గాన అవి ఉన్మత్త ప్రలాపములు గావు ప్రమాణములే అని భావము. అనాది సిధనా వేదవాగుత్సృష్టా స్వయంభువా ఆద్యంతములులేని వేదవాకు స్వయింభువుచే ప్రకటింపబడినది స్వయంభూరేష భగవాన్ వేదోగీతః స్వయంభువా శివాద్యా ఋషి పర్యంతా స్మర్తారో అస్యన కారకాః ఇత్యాదులు స్మృతులు. ఈ భగవంతుడు స్వయంభువు. భగవంతుడైన స్వయింభువుచేత వేద పాడ బడినది శివుడు మొదలు ఋషులువరకు ఈ వేదములను స్మరించి చెప్పినవారు చేసినవారుకారు ఇత్యాదులు స్మృతులు.

చర్ల వంశ వేంకమ నారాయణ శాస్త్రిల తనయుడగు చర్ల గణపతి శాస్త్రిచే అనువదింప బడిన జైమిని పూర్వమీమాంస యందు ప్రథమాధ్యాయమున మొదటి పాదము

ఇంక

## మొదటి అధ్యాయమున- రెండవ పాదము

### 1. అర్థ వాదము ప్రమాణములని చెప్పునధికరణము

32 సూ. ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్యమత దర్థానాం తస్మాదనిత్య ముచ్యతే,

ఆమ్నాయస్య= వేదవిధి వాక్యములు, క్రియార్థత్వాత్= ఇష్టా నిష్టాది సాధక ప్రవృత్తిని వృత్తి క్రియలే ప్రయోజనములు గల వగుట వలన,

అతదర్థానాం= అట్టి యర్థములను జెప్పని యర్థవాదములకు అనర్థక్యము= సార్థకత్వములేదు. అందువల్ల స్యాత్= అనిత్యము=అట్టివాక్యము అనిత్యము అప్రమాణములని, ఉచ్యతే= చెప్ప బడు చున్నది.

సూ. వేదములు ఇష్ట ప్రవృత్తిని అనిష్ట నివృత్తిని దెలుపు క్రియలతే ప్రయోజనముగా గలవి కాన ఆ యర్థమును దెల్పని యర్థవాదములు, అనర్థకములు గాన అవి అనిత్యములు అప్రమాణములని చెప్పనగును.

వివ:- ఇది పూర్వ పక్షిసూత్రము. "సోఽరోదీద్యదరోదీత్ త్రద్రుద్ర స్యరుద్రత్వం" (తై. సం. 1. 5. 1) అతడు ఏడ్చెనుగాన అతనికి రుద్రత్వము గలిగెను. ప్రజాపతి రాత్మనో వపాము దక్లదత్ (తై సం 2-11-1) ప్రజాపతి తనవపను బైకిం దీసెను. దేవా వైదేవ యజన మధ్యన సాయ దిశో న ప్రాజనన్ (తై. సం. 6. 1. 5) దేవతలు దేవ యజ్ఞము చేసి దిక్కులను ఎఱుగరు. "ఈ వాక్యములు ఏ ధర్మమును బోధించు చున్నవి. పోనీ పైవానిని బట్టి రుద్రుని వలె తాను ఏడ్వవలెను. దేవతల వలె ఇతరులను దిక్కులను ఎఱుగరాదు. అను అర్థములను కల్పింపరాదు గదా. కనుక పైవాక్యములు అనర్థకములు. కనుక ఇవి నిత్యధర్మ విషయములుగావు. అనిత్యములు. అవి యప్రమాణములని పూర్వపక్షి యాక్షేపము.

3వ సూ. శాస్త్ర దృష్ట విరోధాచ్చ - 2

శాస్త్ర దృష్ట = శాస్త్రముతోను, దృష్టమైన ప్రత్యక్షముతోను శాస్త్ర దృష్టముతోను, విరోధాత్చ= విరోధము ఉండుట వలనను.

సూ. శాస్త్రముతోను ప్రత్యక్షానుభవమును శాస్త్రదృష్ట విషయములతోను విరోధము ఉండుట వలననూ వేదవాక్యములు ప్రమాణములుగావు.

వివ:- ఇదియు పూర్వ పక్షసూత్రము. "స్తేనం మనః అనృత వాధినీవాక్" మనస్సుదొంగ, వాక్కు అనృతము పలుకునది అను వాక్కులో 'నా నృతం వదేత్' అనృతము పలుకరాదు అను శాస్త్ర విషయములతో విరోధించు చున్నవి. పై వాక్కులవలన దొంగతనము చేయవలయును. అసత్యము పలుక వలయునని చెప్పరాదుగదా. కనుక ఇవి

ధర్మములు ప్రమాణములు గావు. నచైతద్విద్మో బ్రాహ్మణావాస్మో అబ్రాహ్మణాః మేము బ్రాహ్మణులమో అబ్రాహ్మణులమో ఈ సంగతి మాకుఁ దెలియదు. అను వాక్యములు బ్రాహ్మణ్య నిర్ణయమును దెలుపునట్టి "విశుద్ధులగు మాతా పితరుల వలనఁ గలిగిన వారు బ్రాహ్మణులు అను ప్రత్యక్షానుభవమునకు విరుద్ధముగా నున్నవి. మఱియు తస్మాద్ ధూమ ఏవ అగ్నేర్దివా దదృశే నార్చిః తస్మాదర్చిరేవాగ్నేర్నక్తం దదృశేవ ధూమః" కనుక అగ్ని ధూమమె పగలు కనిపించును జ్వాలకనిపించుట లేదు. కనుక అగ్ని జ్వాలయె రాత్రి కనిపించును పొగకనిపింపదు.



అస్మాల్లోకా దుత్క్రమ్య అగ్ని రాదిత్యం గతః రాత్రౌ అదిత్యస్తం" ఈ లోకమునుండి పైకి వెడలి అగ్ని సూర్యుని పొందెను. రాత్రియందు సూర్యుడు ఆ యగ్నిని పొందెను. "ఇత్యాది విషయ ప్రత్యక్షానుభవమునకు విరుద్ధములుగా నున్నవి. కోహి తద్వేదయ ద్యముష్మిన్లోకే అస్తి ఆ లోకములో ఏది యున్నదో అది ఎవడెఱుగును. అను వాక్యము "స్వర్గకామోయజేత" స్వర్గము కోరువాడు యజ్ఞము చేయువలయును. అను శాస్త్రమందు దృష్టమగు విషయముతో విరోధించుచున్నది. కనుక ఇట్లు మూడు విధములుగా వేద వాక్యములు విరుద్ధముగా నున్నవి. గాన అవి అప్రమాణికములని పూర్వపక్షి యాక్షేపము. 

24 సూ. తథా ఫలాభావాచ్చ. ? 

తథా= అట్లే, ఫలాభావాత్చ= ఫలము లేకపోవుట వలనను

సూ. అట్లే వేద వాక్యముల వలనఁ జెప్పబడిన ఫలమును కనిపింపక పోవుటవలనను వేదవాక్యములు ప్రమాణములుగావు. 

వివ:- గర్గత్రిరాత్ర బ్రాహ్మణ ప్రకరణములో "శోభతే అస్యముఖం య ఏవం వేద" ఎవడిట్లు ఎరుగునో వాని ముఖము శోభించును." అని చెప్ప బడెనది. అది తెలిసిన వాని ముఖము అప్పటికప్పుడు మనః క్షోభచే ముఖము శోభించుబలేదు. పైగా పద పదార్థములను సంగ్రహించుటలోఁ గలుగు మనః క్షోభ చేత ముఖ శోభ కలుగునందమా అందులో ప్రమాణము లేదు ఈ విధముగా వేదములోఁ జెప్పబడిన వాక్యములకు ఫలము గలుగుటలేదుగాన అవి యప్రమాణములని పూర్వపక్షియాక్షేపము.

35 మూ. అన్యానర్థక్యాత్. 4
అన్య= ఇతర వేద వాక్యములకు అనర్థక్యాత్= =అనర్థకత్వము గలుగుట వలన.

సూ. కొన్ని వేద వాక్యముల వల్లనే సర్వకామములు సిద్ధించు చుండగా ఇతర ఫలములనుజెప్పు వేదవాక్యములు అనర్థకములగు చున్నవి కాన అనర్థకములగు వేద వాక్యములు ప్రమాణము గావు.

వివ:- "పూర్ణాహుత్యాసర్వాన్కామా నవాప్నోతి" పూర్ణాహుతి చేతనే సర్వకామములు సిద్ధించు చున్నపుడు ఇంక "పశుబంధయాజీ సర్వాంల్లోకా నభిజయతి, తరతి మృత్యుం, తరతిబ్రహ్మ హత్యాంయెూ అశ్వమేధే నయ జతే య ఉచైనమేవంవేద" పశుబంధ యజ్ఞము చేసినపుడు సర్వలోకములను పొందును. మృత్యువును దాటును, ఎవడశ్వమేధ యాగము చేయునో వాడు బ్రహ్మహత్యా పాపమును దాటును ఎవడిట్లు తెలియునో వాడును ఆ ఫలములను పొందును. ఇత్యాది వేద విధుల వలన ప్రయోజనమేమి. పోనీ ఇవి ఫలదాయకములందమా పూర్వవాక్యముల ఆవశ్యకతలేదు. ఇట్లొకటి యావశ్యక మన్నచో నింకొకటి యనర్థక మగును,కాన వేద వాక్యములు అప్రమాణములని పూర్వపక్షి యాక్షేపము.

36 మూ. అభాగి ప్రతిషేధాచ్చ 5
అభాగి= అవ్వసర భాగములు గలవానిని. ప్రతిషేధాత్ చ= నిషేధించుట వలనను,

సూ. నిషేధింప నవసరము లేని భాగములను నిషేధించుట వలనను వేదవాక్యములు ప్రమాణము గావు.

వివ:- "న పృథివ్యామగ్ని శ్చేతవ్యో నాంతరిక్షే, నదివి" భూమి యందు అగ్ని చయనము చేయఁదగదు. అంతరిక్షమునగాని దినమున గాని అగ్ని చయనము చేయఁదగదని నిషేధింప నవసరము లేదు. భూమి యందు అగ్ని చయనము చేయఁదగును గాన దానిని నిషేధింపరాదు. అంతరిక్షమున దినమున నగ్ని చయనము ప్రతిషేధింప నవసరము అక్కడ ఎట్లును అగ్ని చయనము చేయరు, కాన ఎట్లును నిషేధింప నక్కరలేదు, కాన ఈ వాక్యములు ప్రమాణములు గావని భావము.

27 సూ. అనిత్య సంయోగాచ్చ. 6

అనిత్య సంయోగాత్ చ=అనిత్యులగు పురుషుల సంబంధమును బట్టియును.

సూ. జనన మరణములు గలిగి యనిత్యులగు పురుష సంబంధ మును బట్టి ఆ వేద వాక్యములు ప్రమాణములుగావు.

వివ:- ఈ విషయము ఇది వరకె వ్యాపింపఁ బడినవి.

(చూ. 1 అధ్యా. 1పా. 28 సూత్రము.)

28 సూ. విధినా త్వేక వాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాంస్యుః 7

విధీనాం= విధివాక్యములకు, స్తుత్యర్థేన= స్తుతి కొఱకైన, విధినాతు= విధి వాక్యముతో నైతే ఏకవాక్యత్వాత్= సమానముగా నన్వయించు నొకే వాక్య మగుటవలన స్యుః= అర్థ వాదములు ప్రమాణములగును.

సూ. విధింపఁ దగిన విషయములు గల వాయు దేవతాదుల స్తుతి రూపార్థము నపేక్షించిన యర్థవాదములు విధివాక్యముతో అన్వయించి యేక వాక్యముగా నుండుట వలన ప్రమాణములు.

వివ:- వాయుర్వై క్షేపిష్ఠా దేవతా (తై. 2. 1. 1.) వాయువు క్షిప్ర ముగాఁ బోవుదేవత అనెడి యర్థవాదమునకు భూతికామః వాయవ్యం శ్వేత మాం భేత (తై. 2. 1. 1) ఐశ్వర్యము కోరువాడు వాయు దేవతాకమైన శ్వేతమును ఆలంభనము చేయవలయును. అను విధివాక్యము నపేక్షించి దానితోనే కూకృత యుండుట వలన ఇతి యర్థవాదములు ప్రమాణము లని భావము. "వాయువు క్షిప్రముగాఁ బోవుదేవత" అనుచోట క్రియ యైతే తోచుటలేదు. క్రియకు సంబంధించినదియును తోచుటలేదు. అయి నను శ్వేతము నాలంభనము చేయవలయును. అను విధి నుద్దేశించి ఏక వాక్యమగుట వలన ప్రమాణము ఐశ్వర్యము కోరువాడు అన్నంత వఱకు విధి నుద్దేశించిన వాక్యము. వాయువు క్షిప్రముగాఁ బోవుదేవత అన్నది దానితో నేకవాక్యమైనది. పదములు ఆకాంక్షతోఁ గూడినవిగనుక స్తుతికి ఏక వాక్యత గలుగును. ఐశ్వర్యము గోరువాడు ఆలంభనము చేయవల యును. ఎందువల్లననగా వాయువు క్షిప్రముగాఁ బోవు దేవత గనుక,అని యీ విధముగా నన్వయము గ్రహింప వలయును. ఇట్లు ప్రస్తుతవాక్యా

ర్థమును పూర్తిచేయుటలో అర్థ వాదములు సహాయపడును. గాన అవియు ప్రమాణములని తెలియునది.

39 సూ. తుల్యంచ సాంప్రదాయికం. 8

సాంప్రదాయికం=గురు ముఖము ద్వారా సంప్రదాయ సిద్ధముగా అధ్యయనముచేయుట తుల్యంచ= విధివాక్యములకు అర్థవాదములకు తుల్యము గూడ.

సూ. గురు సంప్రదాయ సిద్ధముగా విధి వాక్యములు అధ్యయనము చేసినట్లే అర్థవాదములుగూడ అధ్యయనము చేయబడు చున్నవి గాన అవియు అపౌరుషేయములే గాన ప్రమాణములె.

వివ:- ఏవి చదువ వచ్చునో ఏవి చదువరాదో గురుపరం పరద్వారా సంప్రదాయ సిద్ధముగాఁ జనువఁ బడుచున్నవి గాన అవి ప్రమాదములు గావని భావము.

40 సూ. అప్రాప్తాచానుప బత్తిః ప్రయోగే విరోధః స్యాచ్ఛబ్దార్థ స్త్వప్రయోగభూతస్తస్మాదుపపద్యేత. 9

అనుపత్తిః= వాక్యార్థము సరిపడక పోవుట, అప్రాప్తాచ=పొందఁ బడలేదు గూడ, పయోగే=ప్రయోగించి నప్పుడైతే, విరోధఃస్యాత= విరోధమగును. శబ్దార్థతు=శబ్దముల యర్థమైతే అప్రయోగభూతః= ప్రయోగించ బడునది గానిది. తస్మాత్=అందువలన ఉపపద్యేత=సరిపడును.

సూ. 'మనస్సుదొంగ వాక్కు అనృతము పలుకునది' ఇత్యాదులు సరిపడనివిగావు. మనస్సు దొంగవలెఁ బ్రవర్తింపవలెను వాక్కు అనృతము పలుకవలెను. అని విధానమును ప్రయోగించిన యెడల అనృతము పలుకవలెను, ఇత్యాది శాస్త్ర వచనములకు విరోధము గలుగును గాని కేవలము దొంగ మనస్సు వాక్కు అనృతము పలుకునది శబ్దార్థమాలఁ దెల్సి కొన్నందు వలన అట్లు చేయువలయునని ప్రయోగించఁ బడుటలేదుగదా కాన ఆవాక్యములు సరిపడును గాన అవియు ప్రమాణములె.

వివ:- మనస్సు దొంగగా ఉండ వచ్చును. వాక్కు అప్పుడప్పుడు ఆశాదులచే అనృతము పలుకును. వస్తుస్థితిని చెప్పుచున్నది. చెప్ప అట్లుండరాదు అని చెప్పుచున్నది. ఇది వఱలో శాస్త్ర దృష్టి విరోధాత్

39 సూ. అనుచోటఁ జెప్పబడిన దోషము ప్రవర్తింపదని భావము.

41 సూ. గుణ వాదస్తు. 10

గుణ వాదః తు= విధింపదగినవాని గుణముల కథనమైతే చెప్పఁకొన వలయును.

సూ. విధేయముల కాధారమైన వాని స్తుతిగూడ విధేయముల గుణములను జెప్పుటయె.

వివ:- "వేతస శాఖ యాచావకాభిశ్చాగ్నిం వికర్షతి"
(తై. సం. 5. 4. 4.)

ప్రబ్బలి కొమ్మ చేతను నాచు చేత అగ్నిం లాగుచున్నాడు. అనుచోట ప్రబ్బలి కొమ్మకును నాచుకును నీళ్ళు కారణముగనుక వానియందలి గుణ సామ్యమును బట్టి కారణ గుణములు కార్యములను ప్రారంభింపఁ జేయును. అను న్యాయముచేఁగార్యమగు ప్రబ్బలి కొమ్మ నాచులందుఁ గూడ "ఆపో వై శాంతాః" నీళ్ళు శాంతమైనవన్న గుణములు ఉన్న సంగతి తెలియు చున్నది కాన జలస్తుతిని బట్టి ప్రబ్బలి చెట్టు నాచు స్తుతింపబడుచున్నవి సో అరోదీద్య దరోదీత్తద్రుద్రస్యరుద్రత్వం" అతడుఏడ్చెను అతడు ఎందు వల్ల ఏడ్చెనో అంద వల్ల రుద్రునికి రుద్రత్వము గలిగెను. అనునిదిబర్హిషి రజతం దద్యాత పురా అస్య సంవత్సరాద్గృహే రోదనం భవేత్" ఎవడు బర్హిస్సు రజము ఇచ్చునో వాని యింటిలో సంవత్సరము దాక ఏడ్పు అగును, అనుదానితో గత సంబంధము సః= అతడు. యః= ఎవడు అను దానిని పరామర్శించు చున్నది. అందుచే బర్హిస్సునందు రజతము వేయ రాదు. రోదనము వలనఁ బుట్టిన రజతమును బర్హిస్సునందు వేసిన వానికి రోదనము కలుగును. అని ఇందు నింద గౌణముగాఁ దోచుచున్నది. కన్నీరు తెల్లగా నుండును. కాన ఊకన్నీరు గట్టిపడినచో రజిత సదృశమగును. అని యూహించి రోదనము వలనఁ బుట్టిన రజతమునకు నింద. వర్ణ సారూప్యమును బట్టి నింద రజతము అశ్రువులందుఁ బుట్టక పోయినను అశ్రువులందుఁ బుట్టెనసెను. ధనత్యాగముచేత దుఃఖము గలుగును. అత్యంత ఔదార్యము గల యజమానుని యింటిలోని వారుగూడ ధనత్యాగముచే బాధ పడుదురు. అందు రాజ్యము కలుగును. అని రోదనము చెప్పబడి

నది. ఇట్లే ప్రజాపతి రాత్మ నోన పాము దక్షిదత్ ప్రజాపతి తనవపను పైకిఁ దీసెను. అను దీనినిబట్టి ప్రజాపతి తన వపను ఖండించికూడ విశేష ప్రయోజనమును కోసము కర్మలు చేయబడినవి. అటువంటప్పుడు ఇంక బాహ్య ధన త్యాగము చేత నెందుకు కర్మలు చేయబడరాదు. అని స్తుతికై చెప్పబడెను. ప్రజాపతి వపను ఖండింపక పోయినను స్తుతికోసము కర్మలకై ఎంత పనినైనను చేయవలయును. అని చెప్పుటకని తెలియునది లేక యీ క్రింది విధముగా నైనఁ జెప్పవచ్చును. ప్రజాపతి యనగా వాయువు అకాశము = ఆదిత్యుడని యర్థము. వప యనగా వృష్టి వాయువు రశ్మి. వీనిని వైద్యుతము ఆర్బపము లౌకికము అయిన అగ్నిలో వేయగా అనాది బీజము అన్నము గలుగును. అని దానిని (అలభ్య) పొంది పశువులు సంతానము పొందుచున్నవి గౌణార్థము. ఆదిత్యః ప్రాయణీ యశ్చరుః ఆదిత్య ఉదయ నీశ్చరుః ఆదిత్యుడు ప్రాయనీయమైన చరువు అను దానికి "దేవావై దేవయజన మధ్యవసాయ దిశోన ప్రాజానన్" దేవతలు దేవ యాగము చేసి దిక్కుల నెఱుగరు అన్నది అర్థ వాదము ఆదిత్యరూప చరువు సర్వ వ్యామోహములను నశింపఁ జేయుచున్నది. ఇంక దిగ్వ్యామోహము సంగతి చెప్పనేలయని స్తుతిగా నెఱుగవలయును. కాన దేవతలకే వ్యామోహము గలుగుచుండ మనలెక్కయేమి కానిఆదిత్యుడు అ వ్యామోహమునుగూడఁ బోగొట్టును. అని స్తుతి పరముగా దానిని గ్రహింప వలయును. కాని అవి అనిత్యములు అప్రమాణములు అని యనరాదని భావము.

42 సూ. రూపాత్ ప్రాయాత. 11

రూపాత్ = రూపమును బట్టి, ప్రాయాత్ = తఱచుగా నుండుటనుబట్టి

సూ. రూపమును బట్టి, తఱచుగా నుండుటను బట్టి అట్లు చెప్పబడెను గాన అవి యప్రమాణములు గావు.

వివ:- హిరణ్యం హస్తే భవతి అథ గృహాతి"

బంగారము చేతిలో నుండును. మఱి దాని గ్రహించును అను విధివాక్యము దగ్గఱ నుండుటచే "స్తేనం మన " మనస్సు దొంగ " అనుదానికి దొంగ వ్రచ్చన్న రూపముగా నుధిడును. అట్లే మనస్సు ప్రచ్ఛన్న రూప

ముగా నుండును. అట్లే మనస్సు ప్రచ్ఛన్న రూపముగా నుండి దొంగ కావచ్చును. గనుక జాగ్రత్తగా మనస్సును సరిగా నుంచుకొన వలయు నని స్తుతికొఱకుఁ జెప్పఁబడెను. "ప్రాయేణ అనృత వాగిత్వాత్ పుంసాం" తఱచుగా మనస్సులు అనృత వాదులుగా నుందురుగాన 'అనృత వాది వాక్' వాక్కు తఱచుగా అనృతము చెప్పునదిగా నుండును. అను ప్రాయ కార్థముగాఁ జెప్ప బడినది. నీవు వాక్కును సరిగా నుంచుకొనుము. అని స్తుతి కొఱకు చెప్ప బడినది గాన ఇదివఱకుఁ జెప్పిన దోషములు పట్టవు. కాన పై వాక్యములు ప్రమాణములె యని భావము.

43 సూ. దూర భూ యస్త్వాత్. 12

దూర భూ యస్త్వాత్=దూరము ఎక్కువగా నుండుటవల్ల.

సూ. దూరము ఎక్కువగా నుండుటవల్లఁ బగలు పొగయే కనిపించు చున్నదని జ్వాల కనిపించుట లేదని చెప్పబడెను.

వివ:_ "అగ్ని ర్జ్యోతి, ర్జ్యోతిరగ్ని స్స్వాహేతి సాయం జుహోతి" అగ్ని జ్యోతియే, జ్యోతి అగ్నియె. స్వాహాఅని సాయంకాలము హోమము చేయు చున్నాడు, ఇత్యాది మంత్ర విధికి దగ్గఱగా అర్థవాద రూపము గాతస్మాద్ధూమ ఏ వాగ్నే ర్దివా దదృశేనాగ్నిః" కనుక పగలు అగ్ని నుండి పొగయె కనిపించుచున్నది. అగ్ని కనిపించుట లేదు. అని చెప్ప బడినది. ఇది ప్రత్యక్ష విరోధము గాదు. దూరము ఎక్కువగా నుండుట వల్ల పొగయే గాని అగ్ని కనిపించుట లేదని చెప్పబడెను గాన ఇక్కడ ప్రత్యక్ష విరోధము లేదుగాన ఇదియు ప్రమాణమే.

44 సూ. అపరాధాత్ కర్తుశ్చ పుత్ర దర్శనం. 13

అపరాధా= స్త్రీయొక్క అపరాధము వలన కర్తుః చ= కన్నవానికె, పుత్ర దర్శనము కలుగు చున్నది.

సూ. వ్యభిచారిణీ యొక్క యపరాధమువల్ల అ కన్నవానికె వీఁడు నా పుత్రుఁడని దర్శన మగుచున్నది.

వివ:_ "ప్రవరే ప్రియమాగే దేవాః పితరః ఇతి బ్రూయాత్" గోత్రప్రవర పఠింపఁ బడుచుండగా దేవతలే తల్లి దండ్రులు అని చెప్పవల

యును. "అని విధి వాక్యము" దగ్గఱ న చైత ద్విద్మో వయమ బ్రాహ్మణా బాబ్రహ్మణావా" మేము బ్రాహ్మణులమో అబ్రాహ్మణులమో ఈ సంగతి ఎఱుగము అను నర్థ వాదములో స్త్రీకే మే మెవరమో తెలియును మాకెట్లు తెలియును. పురుషునికిఁ గూడఁ దెలియదు, ఆ స్త్రీ వ్యభిచారిణి యైనచో పురుషునికిగూడ ఆ కొడుకు ఎవరి కొడుకో తెలియదుగదా. మేము బ్రాహ్మణులమో కామో అన్నచో మాకుతెలియ దనఁగా, సంగతి తల్లికే తెలియవలయును. మాకు తెలిసికొన శక్యము కానిది. అన్న దానితాత్పర్యము. ప్రవరాను మంత్రణముచేత అబ్రాహ్మణుడుగూడ బ్రాహ్మణుడగును. అని స్తుతి పరముగా గ్రహింప వలెను. గాన ఇది అప్రమాణము గాదు ఇది ప్రత్యక్ష విరుద్ధమను దోషమునకు సమాధాన రూపఖండనము.

45 సూ. ఆ కాలికేప్సా. 14

ఆకాలిక= తాత్కాలిక సుఖమందు, ఈప్సా= కోరిక.

సూ. తాత్కాలిక సుఖేచ్ఛ కలుగు చున్నది.

వివ:- "కోహి తద్వేద యద్యముష్మిన్ లోకేఽ అస్తి వానవా ఇతి" ఆ లోకమందు స్వర్గమున్నదో లేదో యెవడెఱుగును. ఇప్పుడైతే పొగ ముఖమందుఁ బ్రవేశించినచో వెంటనే మరణము సంభవించును గదా. కాన పొగ పోవుటకై నాల్గు దిక్కులందు ద్వారములు చేయుచున్నాడు. అను నర్థవాదము లోని స్వర్గమున్నదో లేదోయను సంశయము "జ్యోతిష్టోమేన స్వర్గ కామోయజేత్" స్వర్గము కోరువాడు జ్యోతిష్టోమము చేత యాగము చేయ వలయును అను దానిలోఁ జెప్పబడిన స్వర్గవిధానమునకు విరుద్ధము. ఒకచోట స్వర్గమున్నదని చెప్పి మఱొక చోట స్వర్గమున్నదో లేదోయని సంశయము చెప్పబడుట చేత ఆ రెండింటికి విరోధము గనబడు చున్నదని శంకింపగా తత్కాలసుఖప్రాప్తి యందలి కోరికచేఁ గాలాంతరమునఁగాఁబోవు స్వర్గమునుగూర్చిన సంశయాత్మనినిందచే ద్వారము లుంచుట యావశ్యకమని ఆవాక్యము స్తుతికై చెప్పబడినదిగాన విరోధము లేదు.

46 సూ. విద్యా ప్రశంసా. 15.

విద్యా= విద్యచే, ప్రశంసా= గర్గత్రిరాత్రాది ప్రశంస చేయబడు చున్నది.

సూ. జ్ఞానముచే గర్గ త్రిరాత్రాది ప్రశంస చేయబడు చున్నదిగా ఫలము లేదనరాదు.

వివ:- "శోభతేఽస్య ముఖం ఏవం వేద" ఎవడిట్లు ఎఱుగునో వీని ముఖము శోభించు చున్నది. ఇట గర్గ త్రిరాత్రము తెలిసి నంతనే ముఖము శోభిల్లు చున్నదే ఇంక దాని ననుష్ఠించినచో నింకెంత ఫలము గలుగునో కదా అని విద్యా ప్రశంస చేయబడు చున్నది, కులే సంతతాధ్యయన శ్రవణాన్మేధావీ జాయతే" కులమందు సంతతము అధ్యయన శ్రవణము వలన మేధావి పుట్టును. అను దానిని బట్టి అతడు ప్రతి గృహమున అన్నము లభించుటయే గాదు. మహాగౌరవము అంతటం గలుగునని ప్రశంస చేయ బడు చున్నది గాన ఫలము లేదనరాదని భావము.

47 సూ. సర్వత్వ మాధారికం. 16

సర్వత్వం= సర్వము సిద్ధించుననుట. ఆధారికం= ప్రకృరణా ధారమును బట్టి ఔపచారికముగ చెప్పబడినది.

సూ. సర్వకామములు సిద్ధించు నిత్యాది వాక్యములు ప్రకృత ప్రకరణములోని కామములు సిద్ధించు ననుటలో వానికిం దాత్పర్యముగాని యితరములు సిద్ధింపవని గాదు.

వివ:- "పూర్ణాహుత్యా సర్వాన కామాన వాప్నోతి" పూర్ణాహుతి చేత సర్వ కామములను పొందును. అన్నవాక్యములు పూర్ణాహుతిచే తప్పక అన్నియు సిద్ధి చు ననుటలో పూర్ణాహుతి జేయనిచో క్రతు ఫలము సిద్ధింపదనుటలోను తాత్పర్యము. "పశుబంధ యాజీ సర్వాం ల్లోకానభి జయతి తరతి మృత్యుం తరతి బ్రహ్మ హత్యాం యో అశ్వమేధేన యజతే" పశుబంధ యాగము చేసినవాడు సర్వ లోకములను జయించును. అశ్వమేధ యాగము చేసిన వాడు మృత్యువును దాటును అన్నవి వ్యర్థ మనవసరమనుటలో తాత్పర్యము గాదు. అక్కడ అన్ని సిద్ధించును. ఇక్కడ ఇవి సిద్ధించునని భావము. సర్వే బ్రాహ్మణాభోజయితవ్యాః బ్రాహ్మణులందఱు భోజనము పెట్టం దగినవారు. అన్న దానకి ఇంటికి వచ్చిన వారికందఱకుం బెట్టి తీరవలయు నన్న దానిలో తాత్పర్యముగాన దోషము లేదు.

48 సూ. ఫలస్య కర్మ నిష్పత్తే స్తేషాం లోకవత్ పరిమాణతః ఫల విశేషః స్యాత్. 17.

ఫలస్య= ఫలము, కర్మ నిష్పత్తేః= కర్మవలనఁ బుట్టుచుగాన, తేషాం= ఆ ఫలములకు, లోకవత్= లోకమందువలె పరిమాణతః= వాని ఎక్కువ తక్కువల పరిణామమును బట్టి ఫల విశేషః స్యాత్= ఫల విశేషము కలుగును.

సూ. కర్మల వల్ల ఫలములు కలుగును గాన వాటికి లోకములోవలె వాని హెచ్చు తగ్గుదలలను బట్టి ఫలములు ఎక్కువ తక్కువలు గలుగును.

వివ:- లోకమందు ఎక్కువ పనిచేసిన ఎక్కువసొమ్ము తక్కువచేసిన తక్కువ సొమ్ము లభించునట్లు పూర్ణాహుతి చేసిన తక్కువ కాలమే యనుభవింపఁ దగిన స్వర్గఫలమును జ్యోతిష్టోమముతోఁ గూడఁ జేసినచోఁ జిర కాలము అనుభవింపఁ దగిన దగును. అను విషయము దెలుపుటకు అట్లు చెప్ప బడినది. కాన అది వ్యర్థముగాదని భావము. పశు బంధ యాగము చేసినచో-ఇప్పుడేగాక ఎప్పుడును సర్వ లోకములను శాశ్వతముగా జయించునని యర్థము గ్రహింప వలెను.

49 సూ. అంత్యయోర్యథోక్తం. 18.

అంత్యయోః= చివరి రెండు దోషములకు, సమాధానము యథోక్తం= ఇది వఱకుఁ జెప్పిన దానివలెను గ్రహింప వలయును.

సూ. 5. 6. సూత్రములలో చెప్పఁబడిన రెండు దోషములకు సమాధానము ఇది వఱకుఁ జెప్ప బడిన రీతిగానే గ్రహింప వలయును.

వివ:- "న పృథి వ్యా మగ్ని శ్చేత వ్యో నాంతరిక్షం నదివి" భూమి యందు అగ్నిని చయనము చేయ దగదు. అంతరిక్షము నందును చయనము చేయరాదు. దివమందును చయనము చేయఁ దగదు. అనునర్థవాదము "హిరణ్యం నిధాయ చేతవ్యం" బంగారముంచి చయనము చేయఁ దగును అను విధికి శేషము. ఇది హిరణ్య స్తుతి కొఱకు అంతరిక్షమందు దివమునందు చయనము చేయరాదు అన్నది మామూలుగా నిత్యముగా స్థితిని చెప్పుటకును మాత్రమే అని తెలియునది. "ప్రావహణిర్బబరః ప్రావహణుని సంతానమైన బబరుడు" అన్నచోట దోషము ఇది వఱ

లోనే (30సూత్రము) పరిహరింపఁబడినది. కనుక అర్థవాదములో విధి వాక్యైక వాక్యములుగా వాని ప్రశంసకై చెప్పఁబడినవిగాన ప్రమాణములె యని గ్రహింపవలయును.

## ఇది అర్థ వాదాధి కరణము.

2. విధి వన్నిగదాః (అధికరణములు 2)
అర్థవాదములు విధి వాక్యముల వంటివని తెలుపు నధికరణము.

50 సూ. విధిర్వాస్యాద పూర్వత్వాత వాదమాత్రం హ్యనర్థకం. 19
అపూర్వత్వాత్= క్రొత్తదగుటవల్ల విధిః వా స్యాత్= విధివాక్యమె యగును వాద మాత్రంహి= అర్థవాదమైతే అనర్థకం= అర్థములేనిది.

సూ. "ఔదుంబరో యూపో భవతి" ఇత్యాదులందు అపూర్వమగుట వల్ల విధియె చెప్పఁదగును. కాని అర్థవాదమని చెప్పరాదు. అర్థవాదమన్నచో అది యనర్థకమగును.

వివ:- ఔదుంబరో యూపో భవత్యూర్జ్వా ఉదుంబర. ఊర్క్పశవ ఊర్జైవాస్మా ఊర్జం ప్రసూనాప్నోతి ఊర్జఉవరుద్ధ్యై ఇతి (తై. 2. . 1,) మేడికఱ్ఱ యూపస్తంభ మగు చున్నది. బలమెమేడికఱ్ఱ, బలమె పశువులు బలమె మనలను పొందుచున్నది. బలమును పశువులను పొందుచున్నాఁడు బలము అవరోధము కొఱకు. అనునది విధియా లేక మేడికఱ్ఱయొక్క స్తుతియా అని సందేహము కలుగగా ప్రయోజన రూపమైన విధి కలుగుచుండగా స్తుతి చెప్పరాదు అని భావము. గత్యంతరము లేనప్పుడుగాని ప్రతి యర్థ వాదమునకు లక్షణచే ప్రశంసార్థము చెప్పరాదని తెలియునది. ఇది పూర్వపక్షము.

51 సూ. లోక వదితిచేత్. 20
లోకవత్= లోకమందువలె. ఇతిచేత్= అనియన్నచో

సూ. ఇయం గౌః క్రేతవ్యాత్వయా ఈ గోవును నీవు కొనవలెను. అను వాక్యము దగ్గఱ ప్రయోగించిన "ఇయఁకిల గౌసంపన్నక్షీరాప్ర

వత్సాయ"ఈగోవు పూర్తిగాఁబాలు కలది దీని దూడ ఆడది" అను వాక్యములో విధిలేకున్నను ప్రశంసా పదమైనదిగా లోకమందు గ్రహింపఁ బడినట్లే వేదములో కూడ మేడికఱ్ఱ విషయములో గ్రహింపవలె నన్నచో- ఇది సిద్ధాంతిచేసిన ఆక్షేపణ.

52 మూ. న పూర్వత్వాత్. 21

అది పూర్వ మందుండుటవల్ల. న= అట్లు చెప్పరాదు.

సూ. పైనిలోక వ్యవహారములో పూర్తిగాపాలుగలది మొదలైన యర్థములో ఇదివరకు అందఱకు తెలిసినవెగాన అక్కడఁ బ్రశంస చెప్పకొన వచ్చును గాని వేదములోనివి అట్లు తెలియ బడినవిగావు పైఁగా మేడికఱ్ఱతో యూపస్తంభము చేయవలెను, అని విధి కుదురుచున్నపుడు ప్రశంస చెప్పరాదు.

వివ:- పూర్వపక్షవాక్యము. సిద్ధాంతిచేసిన ఆక్షేపమునకు ఖండనము.

53 మూ. ఉక్తంతువాక్య శేషత్వం. 22

వాక్య శేషత్వంఁతు= విధి వాక్యమునకు శేషము. ఉక్తం= ఇది వఱకుఁ జెప్పఁ బడినది గాదా.

సూ. విధివాక్యమున శేకవాక్యమగునని యిదివఱకుఁ జెప్పఁబడినది

వివ:- ఇది సిద్ధాంత సూత్రము. విధి వాక్యముతో ఏకవాక్యత యుండుట వలన విధి వాక్యైకవాక్యతద్వారా ఫలజనకమగుచున్నది. కాన ఇటు స్తుత లక్షణచేఁ జెప్పరాదని భావము.

54 మూ. విధిశ్చానర్థకః క్వచిత్తస్మాత్ స్తుతిః ప్రతీయేత, తత్సామాన్యాదితరేషు తథాత్వం ౨౩

క్వచిత్= కొన్నిచోట్ల విధిః చ= విధి వాక్యముగాజెప్పుట అనర్థకః= అనర్థకమైనది తస్మాత్= దానివల్ల, స్తుతిః= ప్రశంస, ప్రతీయేత= తోఁచును. తత్సామాన్యాత్= దానితో సామ్యముండుటవలన, ఇతరేషు= మిగిలినదాని యందును, తథాత్వం= అలాగే యుండుట. (చెప్పఁబడెను)

సూ. కొన్ని చోట్ల విధి అనర్థకము గాన అంత స్తుతి తోచుచునది గాన అటు స్తుతియె చెప్పఁబడినది. అట్లు విధి యనర్థకమై స్తుతి తోచు చోట స్తుతి చెప్పఁబడు. ఇటువంటిస్థలములో మిగిలినయన్నిఁటి యందును అట్లే చెప్పఁబడినది.

**వివ:**- అప్సు యోనిర్వా అశ్వో అప్సు జో వేతసః గుఱ్ఱము నీళ్ల యందుఁ బుట్టుకలది. ప్రబ్బలిచెట్టు నీళ్ల యందుఁ బుట్టినది. "ఆపో వై శాంతాః శాం తాభిరే వాస్య శుచం శమయతి" నీళ్ళు శాంతమైనవి శాంతమైన నీళ్ళచేత వీనియొక్క శోకమును శాంత పఱచు చున్నాఁడు అను చోట గుఱ్ఱమును నీటియందుఁ బుట్టుక కలదానినిగాఁ జేయ వలయును, ప్రబ్బలి చెట్టును నీటియందుఁ బుట్టినదానినిగాఁ జేయవలయును. "**అని విధ్యర్థము** జెప్పవీలులేదు గాన అనర్థకను. అందుచేత స్తుతి కల్పింపఁ బడుచున్నది. ఇట్లే విధి సందర్భించని యితర స్థలములందు నిట్లే స్తుతి చెప్పవలెనని భావము.

55 సూ. ప్రకరణే సంభవ న్నపకర్షో న కల్ప్యేత్ విధ్యా నర్థక్యం హితం ప్రతి. 24

ప్రకరణే= దర్శపూర్ణ మాసప్రకరణమందు, సంభవన్= స్తుతి సరిపోవు చున్నపుడు అపకర్ష= విధియొక్క యపకర్ష (ఇంకొకరి నుండి తెచ్చి చెప్పుట) న కల్ప్యేత్= కల్పింపరాదు. అట్లు కల్పించినచో విధి= విధి యొక్క= అనర్థక్యం= అనర్థకత్వము స్యాత్.

సూ. దర్శపూర్ణ మాసప్రకరణమందు స్తుతియె సరిపోవు చున్న పుడుదానిని విధి వాక్యముగాఁ గల్పింపరాదు అట్లు కల్పించినచో విధి అనర్థక మగును.

**వివ:**- యో విదగ్ధః స నైఋతః యోఽశృతః సరౌద్రోయః శృతః సదైవత్యః తస్మాదవి దహతా శ్రపయితవ్యః సదైవత్వా యేతి (తై. సం. 2-6-3) ఏ పురోడాశము ఎక్కువ కాచఁబడి నల్లఁబడెనో యది నిఋతిదేవతది, ఏది క్రాఁగలేదో. అది రుద్రునిది ఏదికాఁగినదో అది దేవతలది కాన ఎక్కువకాగి నల్లఁబడకుండ క్రాచదగినదో అది దైవతము కొఱకగును "అనుచోట స్తుతి సరిపోవుచున్నది. విధివాక్య

ను గా చెప్పినచో "ఎక్కడ నైఋతి యాగము ఉండునో అక్కడ నల్లఁ
ఁడునట్లు చేయవలయును. అని విధి వాక్యముగఁ జెప్పుకొనవలెను. అట్లై
నచో వశీకరణము బాధితమగును. ఏలయనఁగా దర్శ పూర్ణమాసకర్మను
గూర్చి నైఋత యాగమే లేకపోవుట నల్లబడునట్లు చేయవలెను. "అనువిధి
ఁరిపోదు అది యనర్థక మగును. కాన అటు స్తుతియు చెప్పవలయునని
భావము.

56 మూ. విధౌచ వాక్య భేదః స్యాత్. ౬5
ఁధౌచ= విధియొక్క యర్థమందైనచో వాక్యభేదః స్యాత్= వాక్యభేద
వ గును.

సూ. విధియె యర్థము చెప్పినచో విధివాక్యము ఏక వాక్యతను
జెప్పక విధివాక్యము కంటెవేఱుగా వాక్య భేదము చెప్పవలసి యుండును.

వివ:- 'యోఽవి దగ్ధః' అనుచో నైఋతి యాగ విధి నిస్వీకరించినచో
తస్మాది విదహతా అను వాక్యముఁకఁటె ముఁదున్న వాక మునందు భేదము
చేయవలసి యుండును అట్లు చేయుటసరిగాదు. "తసాద విదహతా"
అనుదానితో ఏకవాక్యత యుండుటవలన ఔదుంబరో యూపోభవతి, మేడి
కఱ్ఱ యూపస్తంభ మగుచున్నది "అను విధియందు విధికంటె భిన్నమైన
దానిని ఆశ్రయించినచో ఊర్జ్యోఽవరుఃద్ధ్యై బలము అవరోధముకొఱకు అను
దానిలో వాక్యము భేదించును. ఇట్లు మేడికఱ్ఱ స్తంభము ప్రశస్తము.
అది బలము అవరోధముకొఱకు అని మరలచెప్పవలసి వచ్చును. మొదట
మేడికఱ్ఱను ప్రశంసించి తిరిగి అది బలావరోధము కొఱకు అని యసంగ
తార్థము చెప్పవలసి వచ్చును. స్తుతిగా విధి విభక్తిని జెప్పి మరలదాని
చేతనె ఫలకల్పనలో వాక్యావృత్తి రూపమైన వాక్య భేదము చేయవలసి
వచ్చును అని భావము.

ఇది విధి వాక్యము వంటివి అరథివాక్యములని తెలుపు అధికరణము

## 3. అర్థవాదములు హేతువుల వంటివని చెప్పు నధికరణము

57 మూ. హేతుర్వాస్యా దర్థవత్త్వోప పత్తిభ్యాం. ౬6

సిద్ధౌ అర్థవత్త్వేప వత్తిభ్యాం= అర్థము కలిగి యుండుటనుబట్టి ఉపపత్తిని బట్టి హేతుః వాస్యాత్ హేతువుగానె యుండును.

సూ. సార్థక మగుట వల్లన సతిపోవుట వల్లను అర్థ వాదములు హేతుపై యుండును వేముస్తుతులు గావు

"వివ:- శూర్పేణ జుహోతితేనహ్యన్నం క్రియతే" చేటతో హోమము చేయుచున్నాఁడు దానిచేతనే అన్నముచేయఁబడు చున్నది." అనుచోట స్తుతియా హేతువా అని సందేహము గలుగుచున్నది. "ఎందుచే దాని చేత అన్నము చేయఁబడు చున్నదో. అందువలన చేటతో హోమము చేయఁబడు చున్నది. " అని హేతువు చెప్ప వలయును. ఏదేది అన్నమునకు సాధనమో అదెల్ల హోమమునకు సాధనమగునని తేలి నది. అందువలన గరిట గిన్నె మొదలగునవి గూడ హోమసాధనములే అని విధించుట ద్వారా అర్థవత్త్వమును చేటయను పదము తక్కినయన్న సాధనములను బోధించుటద్వారా ఉపపత్తియుఁ గలుగుచున్నది. అందుచే ఇక్కడ హేతువేగాని స్తుతి చెప్పరాదని పూర్వ పక్ష యాశంక.

58 సూ. స్తుతిస్తుశబ్ద పూర్వవత్త్వాద చోదవాచ తస్య. 27
శబ్దపూర్వత్వాత్= విధిశబ్దమే పూర్వముగ (అపేక్షతముగ) కలదగుటవలన స్తుతిః తు= స్తుతియె తస్య= దానికి, అచోదనాచ= విధిలేకపోవుటయె కూడ

సూ. "శూర్పేణ జుహోతి" చేటతో హోమము చేయుచున్నాఁడు. ఇత్యాదులు "తేన హ్యన్నం క్రియతే' దానిచేఅన్నము చేయఁ బడుచు న్నది. ఇత్యాదులె పూర్వముగాఁ గలవగుట వలన అట స్తుతియె గాని దానికి హేతుత్వము చెప్పరాదు.

వివ:_ "శూర్పేణ జుహోతి" చేటతో హోమము చేయుచున్నాఁడు అనునది విధి తేన హ్యన్నం క్రియతే దానిచే అన్నము చేయఁబడు చున్నది. అను వాక్యముచే చేట స్తుతింపఁ బడుచున్నది. కాని చేటతో అన్నది హేతువుగాదు. చేటతో హోమము చేయుచున్నాఁడు అనుచోటఁ దృతీయా విభక్తిగల చేట శబ్దము దానిచే అన్నము చేయఁబడుచున్నది. అనుదానిదగ్గఱ నున్నది. కనుక దానిచే చేట శబ్దము పరామర్శింపఁబడి

విధిద్వారా స్తుతియె చెప్పఁ బడుచున్నది. కాని దగ్గఱగాలేని గరిటె గిన్నె మొదలగువానికి అర్థవత్త్వావత్తులు కుదురవు కనుక హేతువర్థము చెప్పక స్తుతినె చెప్పవలయుననని భావము. ఇది సిద్ధాంత సూత్రము.

౫౯ సూ. వ్యర్థే స్తుతి రన్యాయ్యా ఇతి చేత్, 29
వ్యర్థే= వ్యర్థమైనపుడు, స్తుతిః= స్తుతి అన్యాయ్యా= న్యాయమైనదికాదు. ఇతిచేత్= అన్నచో

సూ. గిన్నె మొదలగు వానివలె అన్నమునకుఁ ప్రకృష్టసాధనము గాక పోవుటచే వర్థమైన చేటయందు స్తుతిచెప్పుట యన్యాయమని చెపిన్పచో.

వివ:- సిద్ధాంతి చెప్పిన వాక్యమునుగూర్చి పూర్వపక్షి శంకావాక్య మిది.

౬౦ సూ. అర్థస్తు విధిశేషత్వాత్ యథాలోకే 30
లోకే యథా= లోకమందువలె విధిశేషత్వాత్= విధికి శేషమగుటవలన అర్థః తు అర్థవంతమె.

వివ:- లోకమందు బలవంతుడైన దేవదత్తుడు యజ్ఞదత్తాదులను గెల్చెను అని చెప్పుదురు. ఇందు బలవంతుఁడైన అనుశబ్దము మామూలు మనుష్యుల కంటె బలవంతుఁడనియె గాని సింహశార్దూలాదుల కంటె బలవంతుఁతుడను నర్థములోఁ బ్రయోగింపఁ బడలేదు. అట్లే చేట శబ్దము అన్నోత్పత్తి సాధనములైన నాఁగలి మొదలగువానికంటె శ్రేష్ఠమనియె కాని గిన్నె మొదలగువానికంటె శ్రేష్ఠమని చెప్పుటకు ఉద్దేశింపఁబడలేదు. కాన అది వ్యర్థముగాదు. సార్థకమెయని భావము. ఇది పై యాశంకకు సమాధానము.

౬౧ సూ. యది చ హేతు రవ తిష్ఠేత నిర్దేశాత్ సామాన్యాదితి చేద వ్యవస్థా విధీనాం స్యాత్. 31
నిర్దేశాత్= చేటహేతువుగా నిర్దేశించుటవలన హేతు- హేతువై అవతిష్ఠేత

యదిచ ఉండునుగదా సామాన్యాత్= తృతీయ సామాన్యముగా హేతు నాచకముగా నుండుటవల్ల ఇతిచేత్= అన్నచో విధీనాం= విధివాక్యములకు అవ్యవస్థా- వ్యవస్థలేకపోవుట, స్యాత్- అగును.

చేటచేత అని హేతువుగా నిర్దేశించుటవల్ల హేతువుగానె యుండును సామాన్య నిదేశమునుబట్టి (చిత్తుల్తో౽) అని యన్నచో ఇట్లు చెప్పినపుడు ఇతర విధులలోఁ గూడ ఇది హేతువు ఇది విధి యన్న వ్యవస్థ పోవును.

వివ:- శూర్పేణ జుహోతి అన్నచోట తృతీయను బట్టి హేతుత్వము చెప్పుట మొదలు పెట్టినచో 'వ్రీహి భిర్యజేత్' వడ్లచే యజించుచున్నాడు. ఇత్యాది విధులందు ఇట్లే చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుచున్నచో ఇది విధి ఇది హేతువు అను వ్యవస్థ లేకపోవలసి వచ్చినది గాన నిట స్తుతియె చెప్పవలయునని భావము.

ఇది అర్థవాదములు హేతువుల వంటివని చెప్పు నధికరణము 4

## మంత్రములు అర్థమును దెలుపుటకని తెలుపు నధికరణము-4

మూ. తదర్థ శాస్త్రాత్ 32

సూ. దాని కొఱకయిన శాస్త్రమువలన అర్థముఁగలుగుచుండ మరల మంత్రములు చెప్పుట ఆ మంత్రోచ్చారణము వలన అదృష్టము సిద్ధించుటకె గాన ఆ మంత్రములు వివక్షితార్థము దెలుపుటకు మాత్రముగాదు.

ఇది ఆక్షేప సూత్రము

వివ:- ఉరుప్రథా ఉరుప్రథస్వ,

అని చెప్పుటచేతనె పరిపోవు చుండఁగా పురోడాశం ప్రథయతి' పురోడాశమునుఁ ముఁదుగా ఇచ్చు పిష్టము వృక్షము చేయుచున్నను అని చేప్పుట వివక్షితార్థమును దెలుపుటకు కాదు. అట్లే "దేవస్యత్వా" దేవునికి నిన్ను అని మొదలుపెట్టి "గాయత్రేణ చ్ఛందాసాఽఽదదే" గాయత్రీచ్ఛందస్సుచే నిన్ను తీసికొనుచున్నాను "అని యా విధముగాఁ జెప్పుటచేతనె సరిపోవుచుండ చతుర్భిరభ్రి మాదత్తే "నాలుగింటిచేత అభ్రిని (గుణపము వంటి కఱ్ఱసాధనలు తీసికొనుచున్నాఁడు అని చెప్పుటచె ఉచ్చారణ

దృష్టము కొఱకేగాని అర్థబాధకొఱకుఁ గాదని తెలియుచున్నది గాన పై వానిలో ఉచ్చారణా దృష్టమె ప్రయోజనమని ఆక్షేపము. అట్లే "ఇమా మగృభన్ రశామృతస్యఇత్యశ్వాభిధానీ అశ్వమమసేతు న జాయతో మాదత్తే అనుచోట అని స్త్రీ లింగముచేఁ తెలియుచుండ అశ్వాభిధానాం అని మరల నేల చెప్పవలెను ఇట్లు చెప్పుటచే ఉచ్చారణకేనని అర్థబోధకుఁ గాదుచ్చారణ

32 సూ. వాక్యమందుఁ బదక్రమములు నియమముగా నుండుటవల్ల మంత్రములు వివక్షితార్థను దెలుపుటకు మాత్రముగాదు.

వివ:- మంత్రమునియత పదక్రమములై యున్నవి. "అగ్నిరుర్ధా దివః" నియమముగాఁ జెప్పుట యర్థబాధకొఱకే అయినచో విపర్యయ ముగాఁ గూడ అర్థబోధ గలుగు చునన్నది. కాన ఇంక నియమము అనర్థ కము .నియమించుటవలన మంత్రములు అర్థి బాధకొఱకుఁగాదు ఉచ్చారా దృష్టము కొఱకు అగును అని ఆక్షేపము.

మూ. బుద్ధ శాస్త్రాత్.

33 సూ. ప్రయోగము వలనన్ల తెలియుచున్నను మరల దానిని దెలుపుటవలన మంత్రములు వివక్షి తార్థము దెలుపుటకు మాత్రముగాదు.

వివ:- అగ్నీధ్రుఁడు అగ్నిని ప్రజ్వలింపఁ జేయుటచేతనె తెలియు చుండఁగా "సంప్రైషేఅగ్నీ దగ్నీన విహర" సంప్రైషములు అగ్నినుండి యింకొక అగ్నులతో విహరించుము" అని చెప్పుటవ్యర్థముగాన ఇది అర్థ బోధకొఱకుఁగాదు ఉచ్చారణా దృష్టము కొఱకేయని యాక్షేపణము.

మూ. అవిద్యమానవచనాత్.

34 సూ. లేని విషయములను దెలుపుట వలన మంత్రములు వివక్షి తార్థ బోధకుఁగావు. (ఋగ్వే- 4-5-58)

వివ:- "చత్వారిశృంగా త్రయెఽస్య పాదాః ఈ యజ్ఞమునకు నాలుగు వేదములు కొమ్ములు "మూడుపాదములు" యజ్ఞసాధన మైన దేనికిని నాలుగులు మొదలైనవి యుండవుగాన ఇది వివక్షితార్థ బోధకుఁ

గాదని భావము. అట్లే "మామాహింసీః" హింసింపకు హింసింపకు అని యజ్ఞములో "హింసయే " లేనప్పుడు అది యింక దేనిని చెప్పును.

మూ. అచేతనేఽర్థం బంధనాత్

35 సూ. అచేతనము విషయముగా చేతనవిషయములైన యర్థములను నిబంధించుట వలన మంత్రములు అర్థబోధకౌలకుఁగావు.

వివ:- "ఓషధే త్రాయస్వైనం" ఓ ఓషధీ! వీనిని రక్షింపుము. శృణోత గ్రావాణః "ఓ శిలలారా! వినుఁడు" ఓషధి శిలలు అచేతనములు వీని విషయమై రక్షణ శ్రవణాది కార్యములచే తన విషయములు చెప్పఁబడినవి. ఇట్లు చెప్పరాదు కాని చెప్పుటవలన అవి అర్థ బాధ కౌలకు(గాదు) ఉచ్చారణా దృష్టమునకని యాక్షేపము

మూ. అర్థ విప్రతిషేధాత్.

36 సూ. మంత్రార్థములకుఁ బరస్పరము విరోధ ముండుట వలన మంత్రము అర్థ బోధకౌలకుఁగాదు.

వివ:- "అదితిర్ద్యౌః అదితి రంతరిక్షః" దివము అదితి, అంతరిక్షము అదితి " ఒక్క అదితినే దివముగాను అంతరిక్షముగాను జెప్పుట విరుద్ధము "ఏకోరుద్రో నద్వితీయోఽవతస్థే అసంఖ్యాతాః సహస్రాణియే రుద్రా అధి భూమ్యాః, రుద్రుఁడొకఁడే రెండవవాఁడు లేఁడు. అనిచెప్పి భూమియందు లెక్కలేని వేలకొలంది ఏ రుద్రులున్నారో" అని చెప్పుట విరుద్ధము కాన అర్థ బాధకు ఇదిగాదు అని అక్షేపము.

1 2

మూ. స్వాధ్యాయవ దవచనాత్

37 సూ. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" స్వాధ్యాయము చదువఁదగినది అని చెప్పినట్లు అర్థము తెలిసికొనవలయు నని చెప్పక పోవుటవలన మంత్రము అర్థబోధకుఁ గావు.

వివ:- ఇదియుఁ బూర్వ పక్షి సూత్రము.

మూ. అవి జ్ఞేయాత్.

38 సూ. కొన్ని మంత్రముల యర్థము తెలిసికొన శక్యము కాక పోపుట వలన మంత్రములు ఉచ్చారణార్థమెగాని అర్థబోధకుఁగావు.

వివ:- "అమ్యకిసాత్ ఇందర్రి బుష్టి రస్మే" సృణ్యే వ్యజర్భరీ తుర్ఫరీతూః ఇంద్రః సోమస్య కాణుకా" ఇత్యాది మంత్రములకు అర్థము చెప్ప శక్యముగాదు, కాన అర్థబోదకొలుకుఁ గావనిశంక-

మూ. అనిత్య సంయోగాన్మంత్రా నర్థక్యం

39 సూ. అనిత్య వస్తువులతో సంబంధ ముండుటవలన మంత్రములు అనర్థకములు కాన ఉచ్చారణార్థములె.

వివ:- "కింతే కృణ్వంతి కీకటేషుగావః ఆయెడ్లు కీకటదేశములందు ఏమి చేయును" "నైచాశాఖం నామనగరం ప్రమగంధో రాజా" నైచాశాఖమను నగరము ప్రమగంధుఁడనురాజు" ఇవి యనిత్య వస్తువులు. కీకటాదులకు పూర్వము ఈ మంత్రము అనుభూత పూర్వములు గావు. కాన ఇవి యుచ్చారణార్థమెగాని వివక్షితార్థ బోధకుఁగావ నిక్షేపములకు సమాధానము చెప్ప బడుచున్నది.

2 3 1

మూ. అవిశిష్టస్తు వాక్యార్థః.

40 సూ. లోకమందువలె వేదమందును ప్రయోగింపఁ బడువాక్యముల యర్థము విశేషము లేనిదె.

వివ:- కేవలుచ్చారణార్థము గాక అర్థబోధకెయని భావము.

మూ. గుణార్థేన పునః శ్రుతిః

41 సూ. చతుః సంఖ్యా గుణముయొక్క యర్థముతోఁ గూడినట్లు చెప్పుటకే మరలః శ్రుతి చెప్పుచున్నది.

వివ:- "చతుర్భిరభి మాదత్తే" నాలుగింటిచే కణబలుగును తీసికొను చున్నాఁడు, అని మరల చెప్పుట ఒక్కొక్క మంత్రము చేతనె నాలుగు మంత్రములచేత స్వీకరింప వలయును, అని అన్ని మంత్రము

లకు సముచ్చయమును బోధించుటకై యట్లు చెప్పఁబడినది కాన మంత్ర ము అర్థ బోధకేయని భావము.

మూ, పరి సంఖ్యా

42 సూ. ప్రస్తుతా ప్రస్తుతార్థములందుఁ బ్రవర్తింపఁగా యొక దానియందె నియమము చేయవలయును.

వివ:_ "అశ్వభిధానా మాదత్తే" అని మరల చెప్పుట అశ్వరసననే స్వీకరించుచున్నాఁడు అని చెప్పుటకు గార్దభ రశనను స్వీకరించుటలేదు అని నియమించుటకని భావము.

మూ. అర్థ వాదోవా.

43 సూ. "ఉరు ప్రథస్వ" గొప్పగా విస్తరింపుము, అనుచానిచేతఁ సిద్ధించుచున్నను మరల చెపుఁచె అది "పురోడాశం ప్రథయతి ' అను అర్థవాద మైనను అగును.

వివ:- కావున యనర్థకము గాదని భావము

2 1

మూ. అవిరుద్ధం పరం.

44 సూ. విపర్యయ పఠనముకంటె నియత క్రమముగల పఠనము లో మిగుల అపూర్వ ముఃఁడునుగాన అట్లు పఠించుటయు అవిరుద్ధమే.

1 3 2

మూ. సంప్రైషే కర్మ గర్హాను పాలంభః సంస్కారత్వాత్.

45 మూ. సంపైషములో (=అనుజ్ఞా వాక్యములో) మంత్రములు మరల స్మరించినచో అగ్నీధ్రునికి సంస్కారము గలుగుట వలన కర్మ బోధలోని దూషణము దూషణముగాదు.

వివ:_ చేయ వలసినదని తెలిసినను అనుష్ఠాన కాలమందు స్మరణచే ప్రయోజనము గలుగును. నియమముకొఱకు మరల చెప్పఁబడుచున్న దని భావము.

1 2

మూ. అభి ధానే ఽ ర్థ వాదః

46 సూ. మంత్రమందు చత్వారి ఇత్యాదులు అర్థవాదము.

వివ :- చత్వారి శృంగాః తయోఽస్యపాదః " అనుమంత్రము సూర్యునిని ఒకజంతువుగా రూపకముద్వారా యాగస్తుతి చేయుచున్నది." ఈ సూర్యునికి దినమందున్న నాలుగు యామములు శృంగములవంటివి. శీతము ఉష్ణము వర్షము ఈ మూడు పాదములు దక్షిణాయణోత్తరాయణములు రెండు అయనములు శీర్షములు, సప్తాశ్వములు హస్తములు, సవనత్రియరూపముగా బద్ధమైనది. వృష్టికఁగారణముగా వృషభము. మహాదేవుఁడై మర్త్యులను ఉత్సాహపఱచుచు సూర్యాభిన్నమైన యగ్ని యావేశించెను. "అని ఇట్లే ఓషధేత్రాయస్వ" ఓషధీః రక్షింపుము. అని స్తుతికై చేతనత్వా రూపయా గ్రావణః శృణోత" అచేతనములయ్యును రాళ్లు వినుచున్నవి. ఇంకఁ జేతనులైన బ్రాహ్మణుల సంగతి చెప్పనేలయని స్తుతికై యట్లు చెప్పఁబడెనుగాన అనర్థకములుగావని భావము.

మూ. గుణాద విప్రనిషేదః స్యాత్

47 సూ. గుణములు చెప్పుటవంన అదితిర్ద్యౌః ఇత్యాదులందు విరోధములేదు.

వివ:- నీవే తల్లివి తండ్రివి అని చెప్పినట్లు అదితియె దినము అదితియె అంతరిక్షము అని వాని గుణములను బోధించుటకట్లు చెప్పఁబడెను. అట్లే ఏకరుద్ర దైవత్యమందు ఒకడే రుద్రుఁడనియు నూఱుగురు రుద్రులు గల దేవతయందు నూరుగురు రుద్రులు అని చెప్పఁబడెను గాన విరోధము లేదని భావము.

2 1
మూ. విద్యావచన మసంయోగాత్.

48 సూ. స్వాధ్యాయకాలమున కర్మలతో సంబంధము లేకపోవుట వలన అప్పుడు (విద్యా + అవచనము =) అర్థ జ్ఞానమునుగూర్చి చెప్పబడలేదు.

వివ:- అందుచే దానికి అర్థ జ్ఞానము అవసరము లేదనుటలో తాత్పర్యము గాదని భావము.

మూ. సతః పరమ విజ్ఞానం

సతః= ఉన్న దానికి, పరం= మిక్కిలి, అవి జ్ఞానము= ప్రమాదాస్యాదుల బట్టి తెలియక పోవుట అగుచున్నది.

49 సూ. "అమ్యక్సాత్ ఇత్యాదులకు అర్ధమున్నను ప్రమాదా లస్యాదులను బట్టి మాత్రము తెలియుటలేదు అర్థములేకకాదు.

వివ:- అమ్యకెసాత్ అని అగస్త్యర్ష ప్రయోగము దానిచే ఇంద్రుఁడు అమతత్వమును ధనమును ప్రార్థించి పొందెను. కోత్వంతూన ఇంద్ర తం రయిందా" అని పై ఋక్కులోఁగలదు. అదొ దానిలోను గ్రహింపవలయు ను. అమ్యక్సా= అమా ఆమాత్యేన= అమాత్యునితో సహాంచాతీతి= కూడ ఉన్నాఁడు గాన అమకా్వ అమాత్యునితో ఇంద్ర= ఇంద్రుడా! తే= నాయొక్క, ఋష్టిః= ఆయుధమును ఆస్మే= అస్మాకం, మాకిమ్ము. అని యర్థము. భూతాంశుఁడను ఋషిజరామరణ నిరాకరణమునకై "శ్రీణ్యేవ" అను దానిచే అశ్వినీ దేవతలను స్తుతించెను. సృణ్యాణవ= సృణీ= అంకు శములకు, దగినవి= ఏనుగులునువలె జర్భరీ= జృంభమాణే= జృంభిచు చున్నవారై నైతోశౌ= యోద్ధలవలె తుర్ఫరీతూ= త్వరమాణౌ= త్వరపడు చున్నవారై పర్ఫరీకా= శోభకలవైన ఉదన్నజౌ= వర్షాకాలమున బుట్టిన చాతక పక్షులవలె, మదేరూ= మదము కలవారైయున్న యశ్వనీ దేవత లారా! మే= నాయొక్క జరాయు మరాయు= జరామరణ ధర్మములు దేహమును, అజరయమయకం= జరామరణములు లేనిదిగాఁ జేయుడని కోరిక, ఇంద్రః= ఇంద్రుఁడు సోమస్య= సోమరసమును, కాణుకా= కామిం చువాఁడు అని యర్థములు గ్రహింపవలయునే అనర్ధకములనరాదని భావ ము ఇట్లే అన్నిచోట్లను.

మూ. ఉక్తశ్చానిత్య సంయోగః

50 సూ. అనిత్యులతో సంయోగముచే గూర్చిన దోషము ఇదివఱకే చెప్పఁ బడినది (చూ. 1 అధ్యా. 1 పా. 21 సూ)

మూ. లింగోప దేశశ్చ తదర్థత్వాత్.

51 సూ. అగ్నిని గుఱించిన యుపదేశములు అగ్నినిగూర్చిన అర్థముగల దగుటవలన మంత్రములు సార్థకములెగాని యుచ్చారణార్థములుగావు.

వివ:- ఆగ్నేయ్యా ౨౭ గ్నీధ్రిముపతిష్ఠతే" అగ్ని దేవతగాఁ గల ఋక్కుతో ఆగ్నీధ్రిమను మండమును స్తుతి చేయవలయును. అనుమాట అగ్ని దేవతగా గలవని అగ్నిలింగము నుపదేశించుట అర్థజ్ఞానము లేకుండ గుదరదు. ఆగ్నేయా అనుపదము అగ్ని దేవతగాఁగల అను అర్థములోతద్ధిత ప్రత్యయమురాఁగా ఏర్పడినదిగాన ఆ యర్థము గలిగిన దగుటవలన సార్థకములని భావము.

మూ. ఊహ

52 సూ. ఊహము ఊహనిషేధమును మంత్రములలోఁ జెప్పుటవలన మంత్రములు సార్థములు.

వివ:- అవసరమైనచో వాక్యములు అన్వయించుటకు వచనావిభక్త్యాదులను మార్చుకొని చెప్పుకొనుట ఊహము. మాతా మన్యతా మనుపితా "తల్లి తలచుగాక తండ్రి తలచుగాక" అనుచోట బహు పశుయాగములో "ఏనం" 'దీనిని' అనునది ఏకవచనమున గుదురక "ఏనాన్" 'వీనిని' అని బహువచనముగా మార్చిన ఊహమువలె "నమాతా వర్థతే నోఫితా "మాతపదము పెరగదు, పితాపదము పెరగదు" అని ఊహ నిషేధింపఁ బడినది. అనఁగా మాతపదము "మాతరః" అని 'తల్లులు' పితా పదము 'పితరః' 'తండ్రులు' అను శబ్దము పెరగదు అని నిషేధింప బడినది. గాని తల్లులు పెరగరనిగాదు కాన ఇట్లు ఊహము చెప్పుట, ఊహనిషేధము చెప్పుటయు అర్థము చెప్పునపుడుగాని, గుదురదు గాన మంత్రములు సార్థకమని భావము.

మూ. విధి శబ్దాశ్చ.

53 సూ. విధి శబ్దములును వివక్షితార్థబోధకములే యగును.

వివ:- "అగ్నే గృహపతౌ శితం హిమాః శతం వర్షాణి జీవ్యాసం "ఓయగ్నీ! గృహపతీ! నూఱు హేమంత ఋతువులు నూరు వత్సరములు

జీవింతునుగాక. ఇత్యాదులు వివక్షితార్థ బోధకములైనపుడేగాని కుదరవని భావము.

ఇది మొదటి యధ్యాయమున రెండవ పాదము

ఇంక

మొదటి యధ్యాయమున మూడవ పాదము

## స్మృతిప్రామాణ్యమును దెలుపునధికరణము 1

1 2 3 4 5

మూ. ధర్మస్య శబ్దమూలత్వా దశబ్ద మనపేక్షం స్యాత్.

1 సూ. ధర్మము వేదమూలముగాన వేద భిన్నములైన స్మృతులు అపేక్షింపక త్రోవలసి వచ్చును.

వివ:– స్మృతులు మానవకృతములు. అందుచెప్పఁబడిని ధర్మములు అప్రమాణములగునని యాశంక.

మూ. అపి వాకర్తృ సామాన్యాత్ ప్రమాణమను మానంస్యాత్.

2 సూ. వైదిక కర్మానుష్ఠానమునకు స్మృతులకుఁ గర్తలొకరే యగుటవలన వానికిఁ బ్రమాణమగు వేద భాగము అనుమానింపఁ బడినదగును.

వివ:– వైదిక మంత్రములు ఏయే కర్మలందు వినియోగింపఁబడునో ఆ కర్మలకు కల్పసూత్రములలోఁ జెప్పఁ బడెను. అవియు స్మృతులును రచించినవారు మహర్షులే, ఆ స్మృతులు గూడ వేద మూలకములే. ఆవేద భాగములను అనుమానముచే నూహింపవలయును. ఆ స్మృత్యులు ధర్మములకు ఆధారమైన ఆవేద భాగములు శాఖలనంతములై విప్రకీర్ణములై యుండుటవలనను పురుషుల ప్రమాదమువలనను మనకుఁ గనిపించుటలేదు కాన స్మృతులును ప్రమాణములెయని భావము.

"శాఖానాం విప్రకీర్ణత్వా త్పురుషాణం ప్రమాదతః
నానాప్రకరణస్థత్వాత్ స్మృతేర్మూలం నదృశ్యతే.

సంచినోతి" వేతనపుంజావమీద ప్రజాపతికి సంబందించిన వానిని ప్రోగు చేయుచున్నాఁడు. "యవ శబ్దమును దీర్ఘశూకములందు ప్రియంగువు లందురు. వరాహ శబ్దమును పందియందును నల్లనివక్షి (కాకి) యందును వేతస శబ్దము ప్రబ్బలి చెట్టునందును నేరేడు చెట్టునందు వ్యవహరించు చున్నారు. రెండు అర్థములు చెప్పినను విరోధము లేదుగాన ఏదో ఒక యర్థము చెప్పి ఒకటి మానినచో విప్రతిపత్తి సమానమేగాన రెండు అర్థములు చెప్పవచ్చునని పూర్వపక్షము.

2 1

మూ. శాస్త్రస్థావా తన్ని మిత్తత్వాత్

9 సూ. శబ్దముల విషయమై వేదముల విషయమై శిష్టులస్మరణ శక్తియె నిమిత్తమై యవిచ్ఛిన్నముగా నుండుట వలన శాస్త్ర నిష్టులగు శిష్టులే యిందు ప్రమాణము.

వివ :- కనుక శాస్త్ర నిష్ఠులగు శిష్ఠులు చెప్పిన ప్రకారము అర్థ నిర్ణయము చేయసగునని భావము. శాస్త్ర నిష్టులగు శిష్టులు యవలనఁగా యమ మయేషు కరంభపాత్రేషు విహితేషువాక్య శేషం యత్రాన్యా ఓషధయో మ్లాయంతే అథై తే మోదమానా ఇవోత్తిష్ఠంతీతి అను దానిని బట్టి యవలనంగా దీర్ఘశూకములని, తస్మాద్వరాహంగా వోఽను ధావంతి" అను దానిచే వరాహ మనఁగా పందియని, అప్సు కేతస ఇతి అను దానిచే కేతస మనఁగా ప్రబ్బలి అని నిర్ణయము చేయవలయునని భావము.

## మ్లేచ్ఛ ప్రసిద్ధ పదార్థ ప్రామాణ్యాధి కరణము

3 4 5 2 1

మూ. చోది తంతు ప్రతీయే తాఽవిరోధాత్ ప్రమాణేన.

10 సూ. శాస్త్ర ప్రమాణముతో విరోధము లేకపోవుట వలన అశిష్టులచేఁ జెప్పఁబడిన దైనను ప్రమాణముగనే యుండును.

వివ:- అశిష్ఠులచేఁ జెప్పఁబడిన పిక, నేమ, సత, తామరసాది శబ్దములకు వారుచెప్పినట్లుగనే యర్థములు గ్రహింపవలెనా లేక ఆ శబ్దములకు

వ్యాకరణోక్త ప్రకారముగా ప్రకృతి ప్రత్యయములను గల్పించి యర్థము చెప్ప వలెనాయని సందేహము రాఁగా ఆ యశిష్టులు చెప్పిన యర్థములు శాస్త్ర విరుద్ధములుగా నుండుటలేదు గాన వారు చెప్పిన పిక= కోకిల, నేమ= సగము తామరస= పద్మము, సత= దారుమయపాత్ర, పారిమండల = శతచ్ఛిద్రాద్యర్థములు గ్రహింపవలెనని భావము

## కల్పసూత్రములు స్వయముగా అప్రమాణము అని తెలుపు నధికరణము 7

1 2 3

మూ. ప్రయోగ శాస్త్ర మితి చేత్

11 సూ. మాశక, హాస్తిక కౌండిన్యకాది యాగానుష్ఠాన, శాస్త్రము లైన కల్పసూత్రములు వేదములవలె అపౌరుషేయములన్నచో.

వివ:_ ఇది పూర్వపక్ష సూత్రము.

2 1

మూ. నాఽపన్ని యమాత్.

12 సూ. స్వరూది రూపమైన సరియైన నియమము లేకపోవుట వలన కల్పసూత్రములు అపౌరుషేయములని యనరాదు.

మూ. అవాక్య శేషాచ్చ.

13 సూ. అర్థవాదములందు వలె స్తుతి రూపమైన వాక్యశేషములు (అర్థవాదములు) ఈకల్పసూత్రములందు లేక పోవుటవలనను అవి అపౌరుషేయము అనరాదు.

మూ. సర్వత్ర ప్రయోగాత్ సన్నిధాన శాస్త్రాచ్చ.

14 సూ. సర్వకల్పసూత్రములందు శ్రుతి సన్నిధానమైన శాస్త్రము కంటె విరుద్ధమైన దానిని ప్రయోగించుట వలనను కల్ప సూత్రములు అపౌరుషేయము లనరాదు.

వివ:_ " సర్వాణిహవీంషి పర్యగ్ని కరోతి " అనునది పురోడాశం ర్యగ్నిం కరోతి " అను ప్రత్యక్ష శ్రుతికి విరుద్ధమైనది. "సర్వ=పూర్వపక్షో

దర్శస్య" అనునది "పౌర్ణమాస్యాం పౌర్ణమాస్యాయజేత" "అమావాస్యాయా అమావాస్యయా యజేత" అను ప్రత్యక్ష శ్రుతికి విరుద్ధము

## సామాన్య శ్రుతికల్ప న్యాధి కరణము 8

1 3 2 4

మూ. అనుమాన వ్యవస్థానాత్ తత్సం యుక్తం ప్రమాణం స్యాత్.

15 సూ. ఆయాస్మృతులను బట్టి ప్రాచ్యాద్యాచారమును బట్టియు కల్పించుకొన్న ప్రమాణమైన శ్రుతి తత్స్మృతి ప్రాచ్యాద్యాచార యుక్తముగనె యుండును.

వివః- ప్రత్యక్షముగా శ్రుతి కనిపింప నపుడు స్మృత్యాది లింగము లను బట్టి కల్పించు కొనఁ దగిన స్మృత్యాదులు ఆయాస్మృత్యాదుల కనుకూలముగనె కల్పించు కొనవలయునని పూర్వపక్షము ఈవిధముగ గౌతమీయ గోభిలీయస్మృతులు ఛందోగులచేతనె గ్రహింపఁ బడును. వసిష్ఠ స్మృతి బృహ్వృచుల చేతను శంఖలిఖిత స్మృతులు వాజసనేయుల చేతను, ఆపస్తంబ బోధాయ నియములు తైత్తిరీయుల చేతను గ్రహింపఁ దగును మఱియు హోలా కాద్యాచరములు ప్రాచ్యుల చేతనె అహ్నైసై ఋకాదులు దాక్షిణాత్యుల చేతనె ఉద్వృష భయజ్ఞాదులు ఉదీచ్యుల చేతను గ్రహింప దగును. కనుకనె ఏక శిఖలు, కొందఱు కొందఱు త్రిశిఖులు, కొందఱు కొందఱు పంచశిఖులుగ నుందురు ఇది శిఖ వంటిదని పూర్వ పక్షము.

1 4 5 3 2

మూ. అపి వా సర్వధర్మః స్యాత్ తన్న్యాయత్వాద్విధానస్య

16 సూ. లేక "పదార్థః కర్తవ్యాః" పదార్థములో చేయదగును అని సామాన్యముగా చెప్పిన శ్రుతికి అట్లే చెప్పుట న్యాయ మగుట వలన శ్రుతిని అనుమానించి తత్తత్స్మత్యా చారములకు అనుకూలముగ శ్రుతిని గల్పించి తత్తదాచారాదులందె వ్యవస్థ చేయక సర్వధర్మములకు అనుకూలముగనె చెప్పవలయును. కనుక హోలాకాదులు సర్వులకు ధర్మమగునని భావము.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము.

1 2 3
మూ. దర్శవా ద్వని యోగః స్యాత్

16 సూ. శిఖాయాం ముండా భృగవః "భృగు గోత్రులు శిఖా ముండనము గలవారు" అని శ్రుతి గనిపించుటను బట్టి శిఖావిషయములో అట్లు వినియోగ మగును.

వివ:- శ్రుతి గనిపించినచోట అట్లు శిఖ విషయములోఁ జెప్ప కొన్నను మిగిలిన విషయములో అట్లు చెప్పరాదని భావము.

2 1
మూ. లింగా భావాచ్చ నిత్యస్య

18 సూ. కర్తృ విశేషమును నియమించు లింగము లేకపోవుట వల నను అట్లు వినియోగ మగును.

2 3 1
మూ. ఆఖ్యాహి దేశ సంయోగాత్

19 సూ. ప్రాచ్యాది దేశ సంయోగము వలన ప్రాచ్యాది దేశస్థులని యాఖ్య యగును గదా.

వివ:- ప్రాచ్యత్వము జాతి గాదు. ప్రాచీ దిక్సంబంధము వల్ల ప్రాచ్యుఁడని వ్యవహారము గలుగు చున్నది.

రాజులు రాజసూయము చేయుదురన్నట్లు దాక్షిణాత్యులన్పిలువఁబడువారు అహ్నైఖుకాదులను జేయుదురని, ఉదీచ్యులనఁ బడువారు ఉద్వృషభ యజ్ఞాదులను జేయుదురని, ప్రాచ్యులనఁ బడువారు హోతా కాదులను చేయుదురని యనరాదు దక్షిణ దేశమునుండి బయలు దేఱినవాఁడు తూర్పున ఉన్నను, ఉత్తరమున ఉన్నను అహ్నైఖు కాదులను జేయుచునే యుండును. అట్లే ఉదాచ్యులును దేశాంతర మందున్నను ఉద్వృషభ యజ్ఞాదులను ప్రాచ్యులును హోలకాదులను జేయుచునే యుండును.

అన్య దేశీయుఁడును. దేశాంతరగతుఁ డయ్యును వియోగమును బట్టి పర పదార్థములను జేయఁడు కాన వ్యవస్థ లేదు. రాజు రాజసూయము జేయ వలయు ననుచోట మాత్రము జాతి నియతము అని తెలియునది.

4 5 3 1 2

మూ. న స్యాద్దేశాంతరేష్వితి చేత్

20 సూ. దేశ సంయోగము వలన ప్రాచ్యాది నామములు గలుగ నన్నచో దేశాంతరము లందున్న వారికి మాథురాది నామములు గుదురక పో వలసి వచ్చును.

వివ:- ఇది వరలో మథురలో నుండుటచే మాథురుఁడని పిలువఁ బడినవాఁడు ఇప్పుడు మథురలో నుండక మఱొకచోట నుండుటవల్ల అ దేశము పేరేగాని మథురతా సంబంధించిన మాథురుఁడని పేరు గలగక పోవలసి వచ్చును. కాని లోకములో దేశాంతరము నందున్నను మాథు రాది నామములు వ్యవహరింపఁ బడుచున్నవని ఆక్షేపము.

4 2 3 1

మూ. స్యాద్యోగాఖ్యా హి మాథురవత్.

21 సూ మథుర యందుఁ బుట్టిన వానిని మాథురుఁడని పిలిచి నట్లుగా ప్రాగ్దిక్కునందుఁ బుట్టినవాఁడు ప్రాచ్యుడనియౌగికముగాఁ బేరుగా నగును.

వివ:- కనుక ఇతర దేశ సంయోగ మున్నను దేశాంతర గతునకు ప్రాచ్యుఁడనిపేరు ప్రాగ్దిక్కు నందుఁ బుట్టినవాఁడని యౌగికార్థము చెప్పి నపుడు విరోధము లేదని భావము.

మూ. కర్మ ధర్మో వా ప్రవణవత్.

22 సూ. ప్రాగుదుగ్ద్రి ప్రవణుఁడైన వానిని వైశ్వదేవములోఁ బ్రాచీన ప్రవణుఁడని యన్నట్లు ప్రాచ్యపదము దగ్గఱ ప్రాచ్యుఁడని కర్తకు విశేషణముగాక ప్రాచ్య దిక్కునందుఁ జేయు కర్మకుఁ గలుగు ధర్మము గాఁగాని చెప్పినను విరోధము లేదు.

వివ:_ దిక్కులు కూడ ఒక యవధిని బట్టి చెప్పఁ బడును గాన ఒక దానిని బట్టి ప్రాగ్దేశమైనను అది దక్షిణా దిక్కులుగా వచ్చును. కనుక ఒక దేశమె ఒకరికిఁ బ్రాగ్దేశము ఒకరికి దక్షిణా పథము అగును. ఇట్లే మిగిలిన వని తెలియును.

2 3 1
మూ. తుల్యంతు కర్తృధర్మేణ.

23 సూ. ఇదియును గర్తృ ధర్మముతో దుల్యమైనదేయను.

వివ:_ నల్లని మనుష్యునిచేఁ గర్మఅనుష్ఠింపఁ బడునపుడు ఆకర్మ కును ఆ మనుష్యుని నల్లఁ దనమునకు సంబంధము లేదుగాన నల్లఁదనము కర్మకు అంగము గానట్లు ప్రాచ్యుఁడు చేయు కర్మకుఁ బ్రాచ్యత్వము అంగముగాదు. కనుక ప్రాచ్యులు హోలాకాదులను జేయుచున్నారు, అను నపుడు ప్రాగ్దిక్కులందున్నవారే హోలా కాదులను జేయవలెను. ఇతరులు చేయరాదు అను వ్యవస్థలేదు. అది సర్వులు ఆచరింప వలసినదే సర్వ ధర్మమే యని భావము. వైశ్వదేవ కర్మలో బ్రాచీన ప్రవణముమాత్రము శ్రుతిలోఁ జెప్పఁ బడుటచే నియతమని తెలియును.

## సాధుప్రయోగ నియమాధి కరణము 6

1 2 3 5 4 6
మూ. ప్రయోగోత్పత్త్య శాస్త్ర త్వాచ్ఛ బ్దేషు నవ్యవస్థా స్యాత్

24 సూ. ఆ యా శబ్దముల ప్రయోగోత్పత్తి వ్యాకరణశాస్త్ర సిద్ధము గాక పోవుట వలన శబ్దముల విషయమై ఇది సాధువు ఇది యసాధువు అను నియమము కలుగదు.

వివ:_ లోకములో జనులు వ్యవహారముతో అనేక శబ్దములు ఉప యోగించుచుందురు. ఆ యుపయోగము పరంపరా సిద్ధముగాని వ్యాకరణ సిద్ధము గాదు. కాన ఆశబ్దములు వ్యాకరణ సాధువులైనను కాకపోయినను వానివల్ల అనాదిగా అర్థబోధ కలుగుచున్నది. దానికి పరంపరగా వ్యవహ

రించుటయే కారణము. కాన ఆ పరంపరగా వాడునవి వ్యాకరణ సాధువులు గాకపోయినను బాధలేదు కాన ఇది సాధువు, ఇది అసాధువు అని యమము అక్కఱ లేదని పూర్వపక్షి ఆక్షేపము. సంస్కృత వ్యాకరణ మహా భాష్యములో గో శబ్దమునకు గావీ గోణీ గోతా గోపో తలిక అనునవి యసాధువులు అని చెప్పఁబడెను. ఈ నియమమేల అని ఆక్షేపణము వచ్చెను వచ్చినాఁడు వచ్చాడు వచ్చేడు మొదలగున వానిచే వ్యవహారములో అర్థబోధ కలుగుచున్నది. కనుక వచ్చెను వచ్చినాఁడుమాత్రమె సాధువనుట యేలశంక.

1 2 3 4

మూ. శబ్దే ప్రయత్న నిష్పత్తే రపరాధాస్య భాగిత్వం.

25 సూ. శబ్దము విషయములో ఉచ్చారణమున నాభి మొదలు కంఠము వఱకు బాహ్యాభ్యంతర ప్రయత్నములు ఉత్పన్న మగుటవలన ఆ ప్రయత్నములో పొరపాటు జరుగును గాన వ్యవస్థ అక్కర లేదనరాదు.

వివ:- సరిగాఁ బలుకలేక గోవు ప్రభృతు ను గావీగోణీ ఇత్యాదులు ధర్మబోధులు పలుకుదురు గాన ఆ ప్రమాదోచ్చరితములను సాధువు లనరాదు అని భావము.

మూ. అన్యాయ శ్చానేక శబ్దత్వం.

26 సూ. ఇట్లు ఒక దానికి గావీత్యాది శబ్దములు సాధువులనుట న్యాయముగాదు. అపుడు ఒక వస్తువును బోధించుటకు + అనేక శబ్దము లుండును. అది న్యాయముకాదు.

వివ:- సాదృశ్యమును బట్టి గావీ గోణీత్యాదుల వలన అర్థబోధ కలిగినను అట్లు అనేక పదములు సాధువులనుట యన్యాయము. హస్తము కరము పాణి మొదలగునవి యొక శబ్దమునకే వాచకము లనేకములైనను అభియుక్తుల యుక్తిని బట్టి వాటికి అర్థముతో సంబంధము అనాది గావున అవి సాధువులని తెలియునది.

1 2 3 4

మూ. తత్ర తత్త్వ మభియోగ విశేషాత్ స్యాత్.

27 సూ. సాధుత్వా సాధుత్వ విషయములో అభియుక్తోక్తుల విశేషమువలన తత్త్వజ్ఞానము గలుగును.

వివ:- అయితే గోవు అనునది సాధువు గావీత్యాదులు అసాధువు లనుట నిశ్చయమేమనఁగా అని యభియుక్తోక్తులైన వ్యాకరణ నియమాల వలన గోవు మొదలైనవి సాధువులని గావిత్యాదులు అసాధువులని నియమము గలుగునని భావము.

1 2

మూ. తద శక్తిశ్చ తదను రూపత్వాత్.

28 సూ. సాధుశబ్దముల నుచ్చరించుటలో అశక్తి యున్నది. కనుక అట్లు పలుకఁ బడుచున్నది. ఆ యసాధుశబ్దమును సాధుశబ్ద రూపము ననుసరించుటవలన అర్థబోధ కలుగు చున్నది.

వివ:- కొందరు గో శబ్దమును పలుకుటలో అశక్తియుండుట వలన గావి ఇత్యాదులను పలుకుదురు. అసాధమైన ఆగావి శబ్దమునువిని దానినే సాధు వనుకొని అట్లే పలుకుదురు. మఱియును గో శబ్దమునకు గావి అనునది సరూపముగా నుండుట వలన గావి అను దానిని విన్నవారు "ఇతఁడు గో శబ్దమును సరిగాఁ బలుకలేక గావి అనెను" అనుకొని దానినిబట్టి అర్థము చేసికొని దానికి సరిగా సమాధానము చెప్పుదురు. అతప్పు దానినివిన్నవారు అదే సరియైనదని అదే పలుకుదురు. ఇట్లు అంధ పరంపరగా అది వాడుక లోనికి వచ్చెను. కాన అది అసాధువని తెలిపి నియమించుటకు వ్యాకరణము అవసరమని భావము.

1 2 3

మూ ఏకదేశత్వాచ్చ విభక్తి వ్యత్యయే స్యాత్.

29 సూ. శబ్దమునకు ఏకదేశమగుట వలన వేఱు విభక్తియున్నను అర్థ బోధ కలుగును.

వివ:- అశ్వకములచేత వచ్చుచున్నను, అని యనఁగా అశ్మకదేశములనుండివచ్చుచున్నను. అనుటకుబదులు అశ్మకములచేతఅనుచున్నాడు

అని అశక్తైక దేశమగు అశ్వకములు చేత అను దానినిబట్టి శ్రోతలు సరిగా అర్థము చేసికొందురు. అట్లే గావిత్యాదులనుబట్టి అర్థబోధ కలుగుచున్నది. కాన అర్థబోధ కలుగుటను బట్టి గావిత్యాదులసాధువులనరాదని భావము.

## నాలోక వేదములందు శబ్దార్థము లొకటెయను తెలుపు-నధికరణము.

2 3 1

మూ. ప్రయోగ చోదనా భావా దర్థైకత్వమ విభాగాత్-

30 సూ ఈ శబ్దములు ఈ యర్థములు వైదికములు ఇవి లౌకికములు అను విభాగ లేకపోవుటవలన అవియేయివి యై నప్పుడే ప్రయోగ చోదన సంభవించుట వలన వైదిక లౌకిక శబ్దము లొక్కటేగాని భిన్నములు గావు.

వివ :- లోకములో అగ్ని శబ్దమునకు స్వరములేదు వేదములో స్వరము గలదు. లోకమున దేవాః అని వేదమునందేవాసః అని ప్రయోగింపఁ బడును. ఇట్లు శబ్దములు భిన్నములుగాఁ గనబట్టుచున్నవి. "ఉత్తానా వైదేవగవా వహంతి" ఏవి దేవతల గోవులో అవి యుత్తానములై వహించుచున్నవి అని యనఁగా ఏవి యుత్తానములై వహించుచున్నవో అవి గో శబ్దమునకు అర్థము. అని వేదమున లోకముకంటె భిన్నార్థముగ గనిపించుటను బట్టి సంశయము గలుగఁగానిట్లు చెప్పఁబడెను. మరియుగోవుఅనఁగా సామాన్య జ్ఞానము కలుగును. కాన గోవును తీసుకొనిరమ్ము అనఁగా గో సామాన్యమును దీసికొనివచ్చుట యసంభవము. అట్లు చెప్పుట వలన అనర్థకమును అగును. గనుక గోవు అనఁగా గో వ్యక్తి అర్థము చెప్పకొనవలయును. గో పద ప్రయోగములో వ్యక్తి యని యర్థము చెప్పినప్పుడే చోదన ఉండును అందుచే ఆకృతి సామాన్యము చెప్పక వ్యక్తినే చెప్పవలయునని సూత్ర భావము. ఇది పూర్వపక్షి సూత్రము.

మూ. అద్రవ్య శబ్దత్వాత్.

30 సూ. శబ్దార్థము ఆకృతి సామాన్యమే యయినచో ద్రవ్యమును ఆశ్రయించిన శబ్దప్రయోగము గుదురకపోవుటవలన శబ్దార్థము వ్యక్తము గాని ఆకృతిగాదు.

వివ:- ఆవు గోవులిమ్ము అన్నపుడు ఆవు గోవ్యక్తులనిమ్ము అని చెప్పుకొనవచ్చును. ఆకృతియే యైనచో అట్లు పలుకుట సంభవింపదని భావము. ఇదియూ పూర్వపక్షి సూత్రము.

సూ. అన్వయ దర్శనాచ్చ.

31 సూ. ఇతరమైనదానిని ఆలంబనముచేయుము ఇత్యాది శ్రుతులలో అన్వపదము కనిపించుటవలనను వ్యక్తియే గాని ఆకృతయర్థముగాదు.

వివ:- "యది పశురుపాకృతః పలాయేత్ అన్యంతద్వర్ణం తద్వయస మాలభేత్" "తీసికొని రాఁబడిన పశువు పాఱిపోయినచో ఆరంగు గల ఆవయస్సుగల మఱొకదానిని ఆలంభనము చేయవలయును." ఇత్యాదులలో అన్యపదమును బట్టి వ్యక్తినే చెప్పవలయును. ఆకృతియే అర్థమైనచో ఆకృతిలో అన్నియుఁ జేరిపోవును గాన అన్యమును ఆలంబనము చేయుమనుట అసందర్భమని భావము. ఇదియు పూర్వపక్షి సూత్రము.

2 1
సూ. ఆకృతి స్తుక్రియార్థత్వాత్.

32 సూ. శ్రుతి వాక్యములు క్రియా ప్రయోగమె ప్రయోజనము గల వగుట వలన శబ్దార్థము ఆకృతియేగాని వ్యక్తిగాదు.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము, శ్యేనచితంచిన్వీత్ స్వర్గకామః స్వర్గము కోరువాడు శ్యేనాకృతిగల స్థండిలమును చయనముచేసి అగ్నిని చయనము చేయవలయును అనుచోట శ్యేన పదమునకు శ్యేనవ్యక్తి అని చెప్పినఁ గుదురదు. శ్యేనాకృతి యని చెప్పవలయును. "వ్రీహీన్ప్రోక్షత్" "వడ్లను ప్రోక్షించుచున్నాఁడు. అనుచోట సర్వవ్రీహ్యాకృతి అని చెప్పుట సంభవింపదు. కావున ఇట వ్రీకి వ్యక్తిని జెప్పవలయును శబ్దార్థము

వ్యక్తి అందమా "శ్యేనచితం" అన్నచో చిక్కు గలుగుచున్నది. పోనీ ఆకృతి అందమా "వ్రీహీన ప్రోక్షతి" అన్నచోట చిక్కుగలుగుచున్నది. గోవును తీసికొని రమ్ము, ఆరు గోవులనిమ్ము మఱొకదానిని ఆలంభనము చేయవలయుననుచోట్ల ఆకృతియర్థము చెప్పినచో దోషములు చెప్పఁబడెను. కాని ఇందుశబ్దార్థము ఆకృతియని చెప్పుటయే న్యాయము. గోవు అను శబ్దము పలికి నంతట గోజాతి, గోవ్యక్తి గోవు సంబంధము సమూహము లింగము కారకము సంఖ్యట దోచును. శబ్దము వ్యక్తి విశిష్టమై యాకృతియందున్న దన్నచో వ్యక్త్యంతర విశిష్టము ప్రతీయమానము గాదు. కాన శబ్దముఆకృతి జ్ఞానమునకు నిమిత్తముఆకృతి జ్ఞానము వ్యక్తి జ్ఞానమునకు నిమిత్తమగును అని తెలియును.

మూ. న క్రియాస్యాదితిచే దర్థాంతరే విధానం న ద్రవ్యమితి చేత.

34 సూ. "వ్రీహ్యే ప్రోక్షం" వడ్లను ప్రోక్షించు చున్నాఁడు అను చోట ఆకృత్యర్థము చెప్పినపుడు ప్రోక్షణ క్రియ సంభవించిందన్నచో, ఆకృత అన్యపశుస్థానమునందు అన్యపశువిధానము సంభవింపదు ద్రవ్య కార్యమగు ఒకగోవునో ఆరుగోవులనో ఇవ్వడమును ఇత్యాదులు సంభవింప దన్నచో,

మూ. తదర్థత్వాత్ ప్రయోగ స్యావ విభాగః.

35 సూ. శబ్దమునకు ఆకృతి (జాపి) అర్థము చెప్పుట ద్రవ్య నియమము కొఱకు అగుటవలనఁ బైనిజెప్పిన ప్రయోగమునకు బాధలేదు.

వివ:- "వ్రీహీన ప్రోక్షతి" వడ్లను ప్రోక్షించుచున్నాఁడు. గోవు నిమ్ము అన్య పశువును దీసికొనిరమ్ము, ఆరు గోవులియ్య వలెను. 'ఇత్యాదులలో మొదట ఆకృత్యర్థము గలుగును. ఆకృతిప్రతీతమై ప్రోక్షనీయమైన వ్రీహులను ఆకృత్యర్థిక పశుశబ్దమునుఁ పశువును విశేషించిచెప్పును. శబ్దమునకు వ్యక్తియర్థము చెప్పినచో ఏవ్యక్తికి వ్యక్తియే యర్థమై విరోధించును. ఆకృతియె (జాతీయ) చెప్పినచో సర్వవ్యక్తులు అర్థమై ప్రయోగములో అన్నిటిని జెప్పుట కుదురదు గాన లక్షణచే తత్తదాకృతిగల (జాతి)వ్యక్తియే యర్థమగును గాన ఆకృతి పక్షము (జాతి పక్షము) శేషమని భావము.

మొదటి యధ్యాయములో మూడవ పాదము

## ఇంక మొదటి యధ్యాయమున నాలుగవ పాదము
## ఉద్భిదాది శబ్దములకు యాగనామత్వము తెలుపు నధికరణము

2 1 3 4 5 6

మూ. ఉక్తం సమామ్నాయైదమర్థ్యం; తస్మాత్ సర్వం తదర్థం స్యాత్

1 సూ. విధియర్థవాదము మంత్రములకు విహితార్థ ప్రకాశము లచే ధర్మమందు మూడు విధములైన ప్రయోజనముల కొఱకు వేదము చెప్పబడినది; కనుక వేదము అంతయు ఈ మూటిలో ఏదోయొక ప్రయోజనము నిమిత్తమగును.

వివ:- ఇది పూర్వపక్ష సూత్రము. "ఉద్భిదా యజేత" ఇత్యాదుల ఉద్భిదమైన (భూమిని పెల్లగించివచ్చిన అంకురాది) ద్రవ్యముతో యాగమును నిర్వర్తింప వలయుననియు నర్థము చెప్పవలయునా లేక ఉద్భిదమను యాగమును చేయవలయును అని లేక ఉద్భిద్గుణము గలదానితో యజింపవలయునా అని సందేహము విధిగాదు కాని అర్థవాద మందున్నచో విధింపఁ దగినదానికి వాక్యశేషమగును. విహితార్థప్రకాశము గాదు గాన ఇంక మిగిలినది ఉద్భిద్గుణము గల ద్రవ్యములు అని గుణవిధి చెప్పవలయునని ఆక్షేపము.

1 5 6 3 4

మూ. అపివా నామధేయం స్యాత్ యదుత్పత్తౌ అపూర్వమభిధాయకత్వాత్.

2 సూ. అట్లుగాక ఉద్భిదమనెడి యాగముచే యజింప వలయునని చెప్పుటచే సరిపోవుచుండ లక్షణచే ఉద్భిద్గుణము గలదానిచే చెప్పుట సంభవింపక పోవుటవలన ఏ యాగోత్పత్తియందపూర్వము పుట్టునో అట్టి యాగ నామధేయమె యగును.

వివ:- ఇది సిద్ధాంత సూత్రము.

## చిత్రాదిశబ్దములకు యాగ నామత్వమును దెలుపు నధికరణము. 3

3 మూ. యస్మిన్ గుణోపదేశః ప్రధానతోఽభిసంబంధః

3 సూ. (వాక్యభేద ప్రసక్తి గలుగును గాన) ఏవాక్యమందుమూడి చేత అనేక గుణోపదేశము తోఁచుచున్నదో అది వాక్య భేదము ప్రసక్తమగునుగాన అది గుణవిధికాదు. ప్రధానముగా యజేత (యజింపవలెను) అను క్రియతో సంబంధించును.

వివ:- "చిత్రయా యజేత" అనుచోట చిత్ర అనునది చితగుణమును చెప్పదు. చిత్రనామక యాగముచేయువలయును అని నామధేయమునే చెప్పును అప్పుడే అది యన్వయించును.

4 మూ. తత్ప్రఖ్యం చాన్యశాస్త్రం.

4 సూ. "అగ్నిహోత్రం జుహోతి" అనుచోట వినఁబడుచున్న అగ్నిదికి(ప్రఖ్యం) ప్రాపకమగు అగ్నిః జ్యోతిర్జ్యోతి అగ్నిః స్వాహాఅని మంత్రలింగాదియైన ఏ యింకొక శాస్త్రమునగలదో అదికూడ కర్మనామ ధేయమేగాని గుణవిధికాదు. ఇట్లే ఆఘారమఘారయతి పంచదశాన్యాజ్యాధ సప్తదశాని పృష్ఠాని "అను చోఁటగూడ ఆఘార, ఆజ్యాపృష్ఠ పదములు కర్మనామ ధేయములె.

## శ్యేనాది శబ్దములకు యోగనామత్వమును దెలుపు నధికరణము-4

5 మూ. తద్వ్యపదేశం చ.

శ్యేనేన అభిచర్య యజేత" సందంశేన అభిచర్యయజేతత్ గవాయుర్యజేత అనుచోట గుణమైన శ్యేనముయొక్క వ్యపదేశము (సాదృశ్యము) ఎందుకలదో అది వానిలో సాదృశ్యము గలదియును నామమె యగును. ఎట్లు ఎక్కి శ్యేనముపడి స్వీకరింపుము. అట్లే శ్యేనసదృశ్యముగా అభిచరించుచు యజింప వలెనని భావము.

## వాజపేయాది శబ్దములకు యాగనామత్వము చెప్పెడి అధికరణము

మూ. నామధేయే గుణశ్రుతేః స్యాద్వి ధేయమితిచేత

సూ. వాజపేయేన స్వారాజ్య కామోయజేత స్వారాజ కామాది వాజపేయముచే యజింపవలెను అనుచోట వాజ (అన్న) ముయొక్క పేయ ద్రవరసము అనగా గంజిచే యజింప వలెను అను (వాజయ) రూప నామధేయమందు గంజిరూప గుణము వినఁబడుటవల్ల గుణవిధానమే చేయవలయు నన్నచో

మూ. తుల్యత్వాత్క్రియ యోర్న 7
ఇది సిద్ధాంత సూత్రము క్రియయో అనః

సూ. చేయవలసిన యంశలో దర్శపూర్ణ మాసవాజ పేయక్రియలు తుల్యము లగుటవల్ల ద్రవ్యసామ్యమునుబట్టి దర్శమాసాది దేశము అపన్నము కావలసి వచ్చును.

వివ:– దర్శపూర్ణ మాస వాజపేయములు చేయవలసినవి. కాన ఓషధి ద్రవ్యములైన యవాగు (గంజి) అను అన్నములో ద్రవ్యము వాజపేయ యాగములో గుణమైనట్లు ధర్శపూర్ణమాస యాగములోగూడ గుణము గాన గుణమనుటలో రెండిటికి సాదృశ్య మున్నది.

దర్శపూర్ణ మాస యాగము ప్రకృతి వాజపేయము వికృతి కనుక ప్రకృతివలె వికృతిని గూడ జేయవలెను అనున్యాయముచే దర్శపూర్ణ మాసముల ధర్మములను వాజపేయమునందు అతిదేశము చేయవలసి వచ్చును. అట్లు చేయవచ్చునది మాకిష్టమే అన్నచో సప్తదశోప సత్కము వాజపేయము అని సామిక ధర్మశ్రవణము విరోధించునుకనుక అట్లనరాదు. ఏల యన దర్శనపూర్ణ మానములో ఉపపదము లన్నవి లేవు. అందుచేత ఇది గుణవిధికాదు. కాన జ్యోతిష్టోమ యాగమునకు వికృతిరూపమైన యాగ నామధేయము.

## ఏకశబ్దే పదార్థ వత్ 8

ఒకసారి ఉచ్చరింపఁ బడిన ధాత్వర్థము నందు
(ఒక్కమాటు కర్మత్వ కరణత్వ న్వయిత్వాదులలో)

ఇతరమైన యవాగూరూపార్థ విధానమువలె యాగశబ్దము అనువాదాశ్రయమైనను దానికై అనువాదముఁవలె అగును. విధేయానువాద్యములో విరుద్ధము లైనను ఒకే సమయమందు వాని సమావేశము చేయవలసివచ్చుచు. ఇదిగుణ విధియైనచో స్వార్థమువలె పదార్థముఁ కూడ చెప్పుటలో యజేత్ యజింప వలెనునను శబ్దము వివక్షితముఁ కాదు.

" స్వారాజ్య కామోయజేత్ " అను దానిచే స్వారాజ్యకాముఁడు యాగము చేయవలెనను స్వార్థవిధి చెప్పఁబడుచున్నది. వాజపేయేన యజేతఅను చోట వాజపేయముచే యాగముచే యవలయును అనువాదము చెప్పఁబడుచున్నది. యజేత అనునది రెండుచోట్ల లన్వయించుఁ చున్నది. గుణ విధి చెప్పినచో రెండువిధములుగా అన్వయించుట కుదురదు. కాన స్వారాజ్యము గోరువాడు వాజపేయ యాగము చేయవలెను అని యాగనామధేయమేఅని చెప్పిన అన్వయముకుదురును గుణకత్వలో వాజపేయ గుణముగా చెప్పినచో కరణత్వమును యాగమును అని కర్మమందును చెప్పవలసివచ్చును అట్లు చెప్పరాదు, కాని వాజపేయ యాగమని యాగనామధేయమే చెప్ప వలయును కనుక వాజపేయముచే యాగము, యాగముచే స్వారాజ్యము అను నర్థమున సంపన్నమగుచున్నది.

## ఆగ్నేయ్యాది శబ్దములలో గుణవాచకములను చెప్పు నధికరణము

తద్గుణాస్తు విధీయేర న్నవిభాగా ద్విధా నాశే న చేదన్యేనశిష్టాః 9

"యదాగ్నేయో౽ష్టాకపాలో౽మావాస్యాయాంచ పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి" అనుచోట గణవిధి యైనచో అగ్నిసహరోడాష్టాక పాలాః వని ఇట కర్మయు అనేకగుణములలో విధింపఁ బడియుండును అట్లు విధింపఁ

బడక పోవుటచే ఇది గుణవిధి కాదన్నచో "విధీయమానమై యాగార్థమందును ఉక్తగుణము అందును క్రియయే విధేయము గుణములే విధేయములు అని నియమించునది లేకపోవుటవలన అట్లనరాదు. అన్యవాక్యముచేత విహితము కానిచో అట్లు చెప్పవచ్చునుకనుక ఇది గుణవిధియే. ఇక్కడ అన్నియు అపూర్వములె కనుక నియమము సంభవింపదు. గుణవిశిష్ట క్రియావిధి సంభవించుట వలన వాక్యభేదము కలుగదు.

ఇందు అష్టకపాలములందు సంస్కరింపఁబడి అగ్నిదేవతగాఁ గలది ఆగ్నేయాత్వము విధింపఁబడుచున్న అదిదర్శము అమావాస్యకు పూర్వము పూర్ణమాసము కంటె పూర్వము చ్యుతముగాదు గాన అచ్యుతము అగ్నికై సంకల్పించి యీయబడినపుడు అది ఆగ్నేయమగును. అందువేఇది ఈవిధముగా యాగము విహిత మగుచున్నది. అది యటుల విధింపబడుచు అగ్నిని అష్టాకపాలముగాచేయక విధించుటకు శక్యముకాదు. సంబంధము విధింపఁబడుచు సంబంధిని చేయకుండ చేయబడినదని చెప్పుటకు శక్యముగాదు అందువలన గుణవిదులు, ఎనిమిది కపాలములందు పంస్కరింఁబడినది. వ్రీహి మయమైనదిగాని యవమయ మైనదిగాని పురోడశమె అగును. అది అనువాదము సిద్ధమై యిట కపాలమందు కనుచున్నాడు గాన అష్టాకపాలమని చెప్పబడుచున్నది. ఇతరమైనదానిచే కాచబడినదాన్ని గ్రహింపరు. అందుచే ఈ పక్షమందు ఇతరమైనచో చెప్పఁబడక పోయినను వాక్య భేదముకలుగదు. ఎక్కడనైతే ఇతర వచనముచే శిష్టమైనవి గుణములగునో అక్కడ " అగ్నిహోత్రమను హ మము చేయుచున్నాడు." అన్నట్లు నామధేయ మగును.

## బర్హిరాది శబ్దము జాతివాచకములని చెప్పు నధికరణము. 10

మూ. బర్హిరాజ్య యోగ సంస్కారే శబ్దలాభ దతచ్ఛబ్దః 10

బర్హిసి ఆజ్యశబ్దములు అసంస్కారే= సంస్కార శూన్యములైనను శబ్దలాభాత్= ఆ శబ్దములు ప్రయోగించుటవల్లనె చెప్పినను సంస్కాయుతశబ్ద నిమిత్త భిన్నమైనజాతి వాచకమో సంస్కరింపఁబడిన తృణములను బర్హి జాతి అని అందురు. సంస్కరింపఁబడిన ఘృతమును ఆజ్యమందురు. అట్లే

సంస్కరింపబడిన పిండిని పురోడాశమందురు. కాని సంస్కరింపబడక పోయిన తృణములను ఒక ప్రాంతమందు "బర్హిరాదాయ గావోగతాః" బర్హిస్సు= గడ్డిని, ఆదాయ తీసికొని గోవులు వెళ్ళెను అనుచున్నను అట్లే ఆజ్యము అమ్మశక్యమైనది గానట్లు అట్లే పురోడాశేన మేమాతా ప్రహేలకం దదాతి "పురాడాశము తనతల్లి ప్రహేలకలో 1 ఇచ్చుచున్నది ఇత్యాదిక ములు సంస్కరింపబడినవి అను నర్ధము వచ్చుచున్నది సంస్కరింప దానిలో ఆశబ్దములో ప్రయోగింపబడుటవల్ల సాదృశ్యమును అనంగా జాతిని చెప్పునని భావము.

## ప్రోక్షిణ్యాది శబ్దములో యేగికమూల చెప్పు నధికరణము-

ప్రోక్షిణీష్వర్ధ సంయోగాత. 11

"ప్రోక్షిణీరాసాదయః" అన్నచోట ప్రోక్షిణీశబ్దమును అర్ధసంయోగమును అర్ధ సందర్భమునుబట్టి యేగికముగనే గ్రహింప వలెను. ప్రోక్షించుటకు సాధనమైన జలము లందు సేచన విషయక అర్ధసందర్భమును బట్టి ప్రోక్షిణీ పదము యోగార్ధము.

"ప్రోక్షణ్యః" అనిప్ర అనుయుపసర్గధాతు ప్రత్యయ సముదాయ మునకు జాతి నిమిత్తతా ప్రయోగమునుబట్టి "సేచన సంయోగమువల్లనైతే ఉపసర్గధాతు కరణ ప్రత్యయ సహితమై ప్రోక్షణ నీళ్ళలా ప్రవర్తించుట జరుగుచున్నది గాన ప్రసిద్ధియెయను గ్రహింపబడిన దగుచున్నది అందు ఘృతమును ప్రోక్షించుట యను యేగికార్థము కలుగు చున్నది.

## నిర్మంథ్య శబ్దము యేగికమె అని తెలుపు అధికరణము.

తథా నిర్మంధ్యే. 12

ప్రోక్షిణీ అను దానికివలె అట్లేనిర్మంథ్య శబ్దమునందు యేగికార్ధమె నిర్మం థ్యముచేత సంస్కారముచేత ఇటుకయు పక్వమగుచున్నది అని సంస్క రింపబడినదాని యర్ధమందిక అచిర మథితాగ్నియందు కనిపించుటవలన నిర్మంథ్య శబ్ద సంస్కారాదక శబ్దము.

వైశ్వదేవే వికల్ప ఇతి చేత 1-4-13

వైశ్వదేవే= వైశ్వదేవశబ్దము వికల్పము (సర్వయాగములను గుణవిధిగా విధించుట కాలేక సముదాయానువాద రూపముగా నామధేయమా అన్నచో

న ప్రకరణాత్ ప్రత్యక్ష విధానాచ్చ నహి
ప్రకరణం ద్రవ్యస్య (1-4 14)

ప్రకరణాత= ప్రకరణమునుఒట్టి, ప్రత్యక్ష విధానాత చ= ప్రత్యక్షముగ వైశ్వదేవేన యజేత వైశ్వదేవముచే యజ్ఞము చేయవలెనని విధించుట వలనను నహి= పైని చెప్పినది చెప్పరాదు. ఇది ద్రవ్యస్య= ద్రవ్యమునకు సంబంధించిన అగ్న్యాది దేవతారూప ద్రవ్యముయొక్క ప్రకరణము కాదు. కనుక వైశ్వదేవ శబ్దము సముదాయార్థము కలది.

మిథశ్చానర్థ సంబంధః (1-4-15)

మిథః= విశ్వదేవులతో అన్యోన్యము

అనర్థము= అర్థముతో సంబంధము కాదు.
"వైశ్వ దేవేన యజేత" అన్నపుడు ఒకేసారిచెప్పఁబడిన ఈ వైశ్వదేవ శబ్దముచేత వైశ్వదేవముఅను సముదాయ రూప వైశ్వదేవమేగాని విశ్వదేవులు అని విశ్వదేవులతో అన్యోన్యము సంబాదార్థము కాదు.

వివ:_ వైశ్వ దేవ శబ్దమునకు ఆవృత్తి చేయకుండ విశ్వయాగ దేవతలకు ఉద్దేశ్య విధేయ సంబందము. అన్యోన్యముచెప్పరాదని భావము

పరార్థత్వాత్ గుణానామ్. (1_4_16) గుణానాం= గుణములకు పరార్థత్వాత్= పరార్థత్వమవుట వలన

సూ. గుణములు పదార్థములు (అప్రధానములు) గాన ప్రధానమైన వైశ్వదేశ శబ్దమును అవృత్తి చేయుట శక్యముగాదు కనుక ఒకేసారి చెప్పఁబడిన వైశ్వ దేవ శబ్దమునకు వైశ్యదేవ యాగమె చెప్పవలయును విశ్వదేవులున్నచో వారికి ఒకేఆహుతి యిచ్చుట కుదురును. ఎన్నోయాహుతులలో అన్ని చెప్పవలసి యుండును.

# వైశ్వానరేఽష్టత్వాద్యర్థ వాదాధికరణము.

పూర్వవంతోఽ విధానార్థా, స్తత్సామర్థ్యం సమామ్నాయే (1-4-17)
పూర్వవంతః= ఇందు చెప్పఁబడినవి విధానార్థముగలవికావు కనుక సమామ్నాయములు వానిలో ఎనిమిది కపాలముకు విధి సామర్థ్యము గాదు.

వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేమ్పుత్రేజాతే పుత్రుఁడు పుట్టగా పన్నెండు కపాలములుగల వైశ్వానర యాగమును చేయవలెను "అన్నచో యదష్టా కపాలో భవతి గాయత్ర్యై వైనం బ్రహ్మవర్చసేన పునాతి ఏది ఎనిమిది కాపాలములు గలదో దానిని గాయత్రియే బ్రహ్మవర్చస్సుతో పవిత్రము చేయును. "అని యీ విధముగా అనేక కపాలములు వినఁబడుచున్నవి. ఈ ఎనిమిది కపాలములు అన్నది గుణవిధులా అర్థవాదములా అని సందేహము కలుగఁగా "అది గుణవిధులే ఏలయన ఇదివరకుఁ జెప్పఁబడిన ఏ విధానార్థకములుగావు ఆ వాక్యమునకు సమామ్నాయములో ఇదివరకు చెప్పకుండుటయను సామర్థ్యమున్నది. అని ఇదివరలోఁ జెప్పఁబడలేదు. చెప్పినచో మరలచెప్పినచో ఆవి అర్థవాదములై అనర్థకములు కావలసి వచ్చును. ఇక్కడ ఎనిమిది కపాలములని ప్రత్యక్షముగా స్తుతి యున్నది. పన్నెండుకపాలములన్నిఁటి పరోక్షస్తుతి, ప్రత్యక్షస్తుతి ఉన్నడు పరోక్షస్తుతి ఏల అందుకు ఇతి గుణనిధులె.
పు

గుణస్య విధానార్థే తద్గుణాః ప్రయోగే

స్యురనార్థకా నహితం వ్యత్యర్థ వత్తాఽస్తి (1-4-18)

గుణస్య=ఎనిమిది కపాలముల రూపమైన గుణమునకు తు= అయితే, విధానార్థే= విధానమును జెప్పు వాక్యమందు అతద్గుణాః= పన్నెండు కపాలములు గల వైశ్వానరయాగమును చేయవలెను అన్నవి వానిగుణములు ప్రయోగే= అనుష్ఠానములో అనర్థకములాస్యుః= మేగును తఁప్రతి= దానిగూర్చి ఎనిమిది కపాలు అన్నదానిగూర్చి అర్థవోతా= సార్థకృమునహి= లేదుగదా.

ఎనిమిది కపాలములు అను గుణమును విధించినప్పుడు ఆగుణములోనే వి పన్నెండు కపాలములుగల వైశ్వానరయాగము చేయవలయునని అనుష్ష్టానములో పన్నెండు కపాలములు ఉపయుక్తములు కావు పోనీ దానిలోను పన్నెండు కపాలములు గల కర్మయందు ఎనిమిది కపాలములు కలదానికి సార్ధక్యము లేదు కనుక అవి అర్ధవాదములె.

తచ్ఛేషో మోప పద్యతే 1-4-19

తచ్ఛేషః=పన్నెండు కపాలములను విధించుదానికి శేషమనుట ఉపపన్నము కాదు ముందు చెప్పఁబోవు పన్నెండు కపాలస్తుతికిని నిది కపాలములతో ఎట్లునుగూడ సంభవింపదు.

అవిభాగాద్విధానార్ధే స్తుత్యర్ధేనోపపద్యేరన్ (విధానార్ధే= 1-4-20) సంఖ్యావిధానార్ధములో అవిభాగాత్=పన్నెండు కపాలములనుచాటి పన్నెంటిలో ఎనిమిది కపాలములను చాటుచున్న ఎనిమిదిగణముగాఁగాక ఇమిడి యుండుటవలన, అట్లు చెప్పుట స్తుత్యర్ధ స్తుతికోసము కావ ఉపపద్యేరన ఉపన్యమగును, పన్నెండు గలసి అతయుతి, అయనయతిలో ఎనిమిది అవ యవములో అవయుతి అవయవములుండుట ఉపపన్నమే గదా ద్వాదశ కపాలస్తుతికై అష్టాకపాల శబ్దము సరిపడును.

కారణంస్యాదితిచేత్ ( 1-4-21 )

కారణం= అట్లు చెప్పుటలో కారణము స్యాత్=ఉంచును, ఇతిచేత్=అన్నచో సూ గాయత్ర్యైనం బ్రహ్మవర్చసేన పునాతి, అన గాయత్రి చేతవ్ వీనిని బ్రహ్మవర్చస్సుచే పవిత్రము చేయవలెనుఅని ఫలము వినఁబడుటచే అది అష్టాదశ కపాలలకు కారణము ఎందుకుకాదు. అన్నచో కనుక కారిక లను బట్టియే విధులు అవును.

అనర్ధక్యాదకారణం కర్తుర్హి కారణాని గుణార్ధే విధీయంతే. (1-4-22) అనర్ధక్యాత్=అనర్ధకములగుటవల్ల కారణం=కారణముకావు కర్తుః=కర్తకు (ఫలముల విషయమై గుణార్ధే= స్తుతి నిమిత్తమై కారణాని= కారణములు విధీయంతే= విధింపఁబడుచున్నవి.

వివ:- విధులు కోరిక కోసమైనచో వాక్యములు వేఱువేఱు కావలెనా "వైశ్వానరం ద్వాదశ కపాలం నిర్వపేత పుత్రే జాతే పుత్రుడు పుట్టంగా పన్నెండు కపాలములుగల వైశ్వానరయాగమును చేయవలెను" అన్నది ఒకవాక్యము ఇది ఉపక్రమము; యత్ ద్వాదశకపాలో భవతి. ఎందువల్ల పన్నెండు కపాలములు గలదో, జగత్యైవాస్మిన్ పశూన్దధాతి" జగతీచందస్సు చేతనేదీనియందు పశువులను ధరించుచున్నాఁడు. "యస్మిన్ జాతే ఏతా" ఇష్టిం నిర్వపతి, ఏపుత్రుఁడుపుట్టి ఈ యష్టిని చేయుచున్నాఁడు పూత ఏవస తేజస్వీ అన్నాదః, ఇంద్రియావీ, పశూమాన్ భవతి, అతడపవిత్రుఁల డేయయి. తేజస్సు కలవాఁడై, అనభక్షణ శక్తిగలవాఁడై ఇంద్రియ సామర్థ్యము గలవాఁడై పశువులుగల వాఁడగును అనునంత వరకుగల విరులాకామము కొఱకు దీనిమధ్యలో ఎనిమిది కపాలములో వినఁబడు చున్నదై వీనితో సంభంధించక పోయినచో వేరువేరు వాక్యములగును కర్తకైతే పవిత్రాత్వాదులు కారణము లగును. "పవిత్రుఁడే అయి ఈ మొదలైనవి వైశ్వానర యాగమందు స్తుతిక్రియన్న విధి పఁబడు చున్నవి. యస్మాత్గాయత్ర్యై వైనం బ్రహ్మవర్చసేన పునాతి పూతవీ వసః ఎందువల్ల గాయిత్రి చేతనేవీనిని బ్రహ్మ వర్చస్సుచేత అతడు పవిత్రు డగును.

యస్మాత్ త్రివృతైనా స్మింస్తేజోదధాతి తేనతేజానకు ఎందువల్లత్రివృత్తుచే వీనియందు తేజస్సును ధరించుచున్నాడు అందుచేత అతడు తేజస్సుగల వాఁడగును. యస్మాత్విరాజైవ అస్మినన్నాద్యంద ధాతితేనన్నాదః ఎందువల్ల విరాజసామచేత వీనియందు అన్నాదులను ధరించమన్నారు అందుచే అన్నము తిను వాడగును యస్మాత్ త్రష్టుభైవాస్మిన్ ఇంద్రియం దధాతి తేన ఇంద్రియావి ఎందువల్ల త్రిష్టుబ్బుచేత వీనియందు ఇంద్రియము నుధరించుచున్నాడు అందుచేసమర్థేంద్రియములు గలవాఁడగును యస్మాజ జగత్తైన వాస్మిన పశూని దధాతి తేన పశుమాన భవతి ఎందువల్ల జగతి ఛందస్సుచే పశువులు గలవాఁడు చున్నాడు. విధులు కోరికలు తీర్చక అర్థవాదములుకానిచో ఇవి అనర్థకములగును, అందువలన అష్టకపాలాదులు బ్రహ్మవర్చసాదులు కారణములు కాన ఎనిమిది కపాలములు ఇత్యాదులు అర్థవాదములు అనఁగా స్తుతి పదములు.

## యజమాన శబ్దము ప్రస్తరాదిస్తుతి పదములనిచెప్పు అధికరణము తత్సిద్ధిః( 1-4-23 )

యజమానః ప్రస్తరః యజమానుఁడు జాయి యజమాన ఏక కపాల యజమానుఁడొక కపాలము కలవాఁడు ఇత్యాదులలో గుణనిధి (స్తుతి)ః యా అర్థవాదము అని సందేహము గలగఁగా ఇట్లు అపూర్వముగా విధించుటచే యజమానుని కార్యం ప్రస్తారము చేయుచున్న రనుటచే ప్రస్తారము వలన యజమానుని తత్= కార్యమున సిద్ధిః= సిద్ధించుచున్నను

ప్రస్తరే జుహు మాసాదయతి.

## ఆగ్నేయాది శబ్దానా బ్రాహ్మణ్యాదిసూత్సర్థతాధికరణము జాతిః (1-4-24)

జాతిః బ్రాహ్మణాది డుదయస్తుతి వయా ఆగ్నేయో వై బ్రాహ్మణః ఐంద్రో రాజన్యః వైశ్యోవైశ్వదేవః ఇత్యాది జాతివాచక పదములు స్తుతివదములు

## యూపాదిశబ్దములకు యజమానస్తుతి పరమాధికరణము. సారూప్యమే. (1-4-25)

యజమానో యుపః యూపము యజమానుండె, ఆదిత్యోయూపః వలి యూపమునూ ఆదిత్యాదులందు యజమానాది సారూపార్థము చెప్పవల యును యుపుమణ్యము ఊర్ధ్వత్వము

## సూర్యునివలె తేజస్వత చెప్ప వలయును కాన అవి అర్థవాదములు ప్రశంసా [1-4-26]

అపశవోవా అన్యేగో అశ్వేభ్యః అయజ్ఞోవా ఏషయోఽసామా. అసత్రంవా ఏతత్ యదదద ఛందో మమ పశువులు లేవారు గో అశ్వములాంటి

ఇతరములు పశువులు కావు. సాకు లేనిది యజ్ఞముకాదు, ఛందస్సులేని ఫలముకాను అన్నచో అపశ్వాది శబ్దములు పశ్వాదుల నిందదారా గీతాది ప్రశంసా పరములు.

ఇంక బాహుల్యముగా సృష్టివ్యపదేశాధి కరణము.

భూమా [ 1-4-27 ]

సృష్టీరు పదధాతిలో సృష్టికారకమంత్రములను ధరించుచున్నారు. అన్నచోట సృష్టిలింగమంత్రములను ఎక్కువగా చెప్పటచేత అర్థవాదముస్తుతికే.

ప్రాణి భృచ్ఛబ్దానాం స్తుత్యర్థతాధికరణము.

లింగసమవాయాత్ [ 1-4-28 ]

లింగ సమవాయాత్= ప్రాణి లింగములుగల మంత్రముల సమీపమందు పఠించిన వాగితో సంబంధమువల్ల ప్రాణము లేనివానిని గూడ ప్రాణుల క్రింద గ్రహింప వచ్చును ప్రాణభృత ఉపదధాతి ప్రాణులను సమీపమున ధరించు చున్నాడు ఛత్రిధారులు వెళ్లుచున్నారు అన్నప్పుడు ఒక ఛత్రము ధరించక పోయిననూ వానినిగూడ లక్షణచే గ్రహించినచో గ్రహింప వలయును.

వాక్యశేషేణ సంధిగ్ధార్థ గ్రహణమ్

సంధిగ్ధేషు వాక్యశేషాత్ [1-4-29]

అక్తాః శర్కరాః ఉపదధ్యాత్ తడిపిన శర్కరలను నిప్పుదగ్గర ఉంచుచున్నాడు ఇత్యాదులందు నేయి నూనె మొదలైన వానిలో ఏదో యొక దానితోనో లేక నేతితోనో తడుపుట అని సందేహము గలవానితో వాక్యశేషమువల్ల తేజోవై ఘృతంను నుతైజమేవాగ్నించినుతే అయర్ఘత్వం నేయి యెతోజన్యు ఆయువె నేయి తేమ్పుగల అగ్నిపై ఉంచుచున్నాడు అను వాక్య శేషమువల్ల నేతితో దడపవలెను అను విధి చెప్పవలయును అనువాదము చేత విధేయార్థస్తుతిని బట్టి ఘృతమన్ని నిర్ధారణ గలుగును.

## సామర్థ్యాను సారేణ వ్యవస్థ
## అర్థాద్వా కల్పనైకదేశత్వాత్ (1-4-30)

అర్థాతవా = వస్తువులసామర్థ్యమువల్ల ఏకదేశత్వాత్ = వేదైకదేశము వలన, కల్పనా విధేయార్థసిద్ధికల్పన.

హస్తేనా వద్యతి, స్త్రువేణా వద్యతి, స్వధితినా అవద్యతి హస్తముచే శుద్ధము చేయుచో స్త్రూవసాత్రచేతఁచేయుచు స్వధితచేత శుద్ధము చేయుచున్నారు. ఇత్యాదులందు ఆవధాన సాధనత్రియము వ్రిత్యేకము. అవదామోద్దేశము చేత లేక ద్రివ్యవిశేషము చేతనోలను చూచి ఫలానా దానిచేత అని నియమించునదియు లేకపోవుటవలన మొదటనే చెప్పినదాని చేత అవియు సిద్ధించుట చేతనో కల్లవల్ల చెంతచేరు పురోడాశీదులకే అని గ్రిహించుట వలన సిద్ధించును. కనుక వేదవ్రిత సాద్యము ధర్మాచారము.

అంజలినా సక్తూన వ్రిదాతవ్యే జుహో రెండుచేతులుకలిపి జోడించుట అంజలి. అంజలిచే ఇచ్చుటయందు హోమము చేయుచున్నారు అని వ్యాకోశము గర్తవ్యమని గ్రహించ వలయును.

ఇ ది

జైమిని రచితమైె చర్ల వెంకమాంబా నారాయణ శాస్త్రిల
తనయుడైన గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
పూర్వమీమాంసా దర్శనమందు నాల్గవపాదము

స మా ప్త ము